# అసలైన ఆనందం వీటి సువాసనలో వుంది




పార్లే

## ఫ్రూట్ డ్రాప్స్

మళ్ళీ మళ్ళీ తినాలనిపించే తియ్యటి బిళ్ళలు...
మనోరంజకమైన మాధుర్యమగు రుచులు...
రాస్ప్బెరీ, బత్తాయి, అనాసకాయ, నిమ్మకాయ,
కమలాఫలము. ఎంత తక్కువ ధర.

ఉఝ్జూతలూరించే
అయిదు పండ్ల రుచులు ప్రతి
ప్యాకెట్‌లో 10 బిళ్ళలు లభిస్తాయి






everest/979/PP tl

## చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్!

ఫలితమును చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునప్పుడు కొంచెము టినోపాల్ వేయండి. అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడా కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.







® టినోపాల్ జె. ఆర్. గైగీ ఎస్. ఏ. వారి
స్విట్జర్లాండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగీ లిమిటెడ్, పి. బా. బాక్సు 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA 12A/70 Tel

# బలానికి
# బ్రిటానియా
## హార్లిక్స్ బిస్కట్లు ఇవ్వండి వీళ్లకి




వివేకవంతులైన తల్లులు చలాకీగా చురుకుగా ఆడుకొనే పిల్లలకు అవసరంగా బలం కలగడానికి బ్రిటానియా హార్లిక్స్ బిస్కట్లునే విశ్వసిస్తారు. మంచి రుచిగా పుష్టికరంగా ఉండే బలాన్ని కలిగించే బిస్కట్లు-స్కూలుకు తీసుకు వెళ్లవచ్చు లేకపోతే ఇంట్లోను తినవచ్చు.

**బ్రిటానియా** అంటే నాణ్యత

BBC/1368

# దీన్ని నా స్వంత డబ్బుతోనే కొనుక్కున్నాను!



మీకు కూడా మీ స్వంత డబ్బుతో చక్కని వస్తువులను కొనుక్కొని ఆనందించాలని లేదూ? సమీపంలోవున్న ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకులో ఒక మైనర్ సేవింగ్స్ అక్కౌంట్ ప్రారంభించండి. మీకు ధనరూపంలో దొరుకుతూన్న కానుకల్ని ఖర్చు చేసేయకుండా మీ స్వంత బ్యాంక్ అక్కౌంట్‌లో జమ కట్టండి. మీ ఆదాలు రోజు రోజుకి పెరుగుతూండడం గమనించండి.

ఆఖరికి ఒకరోజున-మీ ఖాతాలో చాలా డబ్బు పోగవుతుంది, అదంతా మీ స్వంతమే!

ఐఓబి—మీతో మెలగగలిగేటంత చిన్నది ఎంత సేవయినా చేయగలిగేటంత పెద్దది.

**ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్**

సెంట్రల్ ఆఫీసు: 151 మౌంటు రోడ్డు, మద్రాసు-2.

IOB-6121



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మూఢులను తెలివిగలవాళ్ళు మోసం చేస్తారు. మోసం చేసే వాళ్ళను వాళ్ళ కన్న తెలివైనవాళ్ళు మోసం చేస్తారు. దొంగలూ దొంగలూ చేరి ఊళ్ళు పంచుకున్నారన్న సామెతగా స్వార్థపరులు మోసపు ధనాన్ని రాజీపడి పంచుకుంటారు. "పిల్లి దానం" అన్న కథలో ఇదే జరుగుతుంది.

సంపుటి 48 జనవరి '71 సంచిక 1








పరోపకారాయ ఫలంతి వృక్షాః,
పరోపకారాయ వహంతి నద్యః,
పరోపకారాయ చరంతి గావః,
పరోపకారార్థ మిదం శరీరం....1

[ఇతరులకు ఉపయోగంగా ఉండగలందులకు చెట్లు ఫలాలు కాస్తున్నవి, నదులు ప్రవహిస్తున్నవి, గోవులు మేస్తున్నవి. ఈ శరీరం పరోపకారార్థమే.]

శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన,
దానేన పాణి ర్నతు కంకణేన,
విభాతి కాయః కరుణాపరాణాం
పరోపకారేణ న చందనేన....2

[చెవులకు శాస్త్రశ్రవణమే గాని కుండలాలు అలంకారం కావు; చేతులకు దానం అలంకారం గాని కంకణం కాదు; దయాగుణం కలవారికి పరోపకారం అలంకారం గాని చందనపుపూతలు కావు.]

పద్మాకరం దినకరో వికచం కరోతి;
చంద్రో వికాసయతి కైరవచక్రవాలం;
నాభ్యర్థితో జలధరోపి జలం దదాతి;
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః....3

[సూర్యుడు తామరకొలను వికసింప జేస్తాడు. చంద్రుడు కలవలను వికసింప జేస్తాడు. మేఘుడు అడగని వారికి కూడా నీరిస్తాడు. మంచి వాళ్ళు తమంత తామే పరోపకారానికి పూనుకుంటారు.]

పరోపకారం



# బెడిసిన షరతు

ఒక చిన్న గ్రామంలో శేషయ్య అనే కటిక పేద రైతుకూలీ ఉండేవాడు. అతను పొలం పనులలో ఎంత శరీరకష్టం చేసినా తిండికీ, బట్టకూ పోగా వెనకవేసుకునేటందుకు ఏమీ మిగిలేది కాదు. అందుచేత శేషయ్య పట్నం వెళ్ళి, కష్టించి పనిచేసి, కాస్త డబ్బు మిగుల్చుకుని, తన గ్రామంలో కాస్త భూమి కొనుక్కుని స్వతంత్రంగా బతుకుదా మనుకున్నాడు.

శేషయ్య పట్నం చేరి, కనిపించినవాళ్ళనల్లా పని అడిగాడు, కాని ఎవరూ ఇవ్వలేదు. ఏం చెయ్యటానికీ పాలుపోక ఒక కోమటి దుకాణం ముందు కూర్చున్నాడు. దుకాణదారైన శెట్టి బయటికి వచ్చి, "ఎవరవు నువు?" అని శేషయ్యను అడిగాడు.

తనది ఫలానా గ్రామమనీ, పనికోసం పట్నం వచ్చాననీ, ఎక్కడా దొరకలేదనీ శేషయ్య చెప్పాడు. శెట్టికి పనివాడు కావాలి. కాని ఆయన పెట్టే నిబంధనలకు తట్టుకోలేక కుదిరిన పనివాళ్ళు వెళ్ళిపోతూ ఉంటారు. ఈ పల్లెటూరివాడు అమాయకుడులాగున్నాడు, కొంతకాలమైనా నిలకడగా ఉంటాడేమో నని శెట్టికి అనిపించింది.

"ఒరే, అబ్బీ, మాకు ఇంటి పనీ, దుకాణంలో పనీ, చెయ్యటానికి మనిషి కావాలి. నిలకడగా ఉండి ఓ సంవత్సరం పాటు పని చేస్తావా?" అని శెట్టి అడిగాడు.

"ఏమిస్తారు?" అన్నాడు శేషయ్య.

"సంవత్సరానికి రెండువందల రూపాయలిస్తాను. రెండుపూటలా విస్తరి నిండా అన్నం పెడతాను. మధ్యలో నువు పని మానితే నీకు జీతం ఏమీ ఇవ్వను. నేనే నిన్ను మధ్యలో పంపదలిస్తే రెట్టింపు జీతం ఇచ్చి మరీ పంపుతాను. ఈ షరతు నీకు సమ్మతమైతే పనికి కుదురు," అన్నాడు శెట్టి.

కొర్రపాటి పద్మావతి



ఈ షరతుకు శేషయ్య సంతోషంగా ఒప్పుకున్నాడు.

పొద్దునే లేపటమూ, కసువు ఊడ్చ డమూ, చెట్లకు నీరు పొయ్యటమూ, శెట్టి భార్య ఇంటిపని చేసుకునే సమయంలో, పిల్లలను ఆడించటమూ, ఆ మీదట దుకా ణంలోకి వెళ్ళి, శెట్టిని భోజనానికి పంపి, ఆయన వచ్చేవరకూ దూకాణంలో బేర సారాలు సాగించి, ఆయన తిరిగి వచ్చాక ఇంటికి తాను వెళ్ళి భోజనం చెయ్యటం శేషయ్య పని.

మొదటి రోజు శేషయ్య ఈ పనులన్నీ ముగించి, విస్తరి వేసుకుని భోజనానికి కూర్చునేసరికి, శెట్టి భార్య ఒక చిన్న పళ్ళెంలో కొద్దిగా పొడి అన్నం తెచ్చి విస్తరి నిండా చల్లి, పచ్చడి వేసి వెళ్ళిపోయింది. శేషయ్య నిర్ఘాంతపడి, మళ్ళీ అన్నం అడగ డానికి సిగ్గువేసి; ఆ అన్నమే వూడ్చునుని రెండుమూడు ముద్దలు చేసుకుని తిని, తిరిగి పనిలోకి వెళ్ళాడు.

రెండు, మూడు రోజులు ఇలాగే గడిచి నాక శేషయ్య శెట్టితో, "అయ్యగారూ, భోజనం చాలటంలేదు," అన్నాడు.

శెట్టి ఉగ్రుడైపోయి, "నేను షరతు ప్రకారం విస్తరి నిండా అన్నం పెడుతు న్నాను. ఇష్టముంటే ఉండు, లేకపోతే వెళ్ళు," అన్నాడు.

శేషయ్యకు శెట్టి మీద చాలా కోపం వచ్చింది. షరతు ప్రకారం తాను చెయ్య గలది చెయ్య నిశ్చయించాడు. అతను తెల్ల వారుజామునే లేచి, ఇటు కసువు అటూ, అటు కసువు ఇటూ చిమ్మి, అంటుగిన్నెలను సొట్టలు పోగొట్టి, మసి వదలకుండా తోమాడు. తరవాత పిల్లలను ఆడించడానికి దూరం తీసుకుపోయి, వాళ్ళను గతుకుల నేలలో పరిగెత్తనిచ్చాడు. చిన్న పిల్లవాడు పడిపోయి ఏడుస్తూంటే, పిల్లలను ఇంటికి తీసుకొచ్చి, "అమ్మగారూ, పిల్లలు ఏడుస్తున్నారు," అని చెప్పాడు.

"అయ్యో, నా చేతిలో పని కాలేదు. ఇంకా కొంచెంసేపు ఆడించు," అంటూ

శెట్టి భార్య పిల్లలకు ఏదో తినుబండారా లిచ్చి పంపింది. శేషయ్య వాళ్ళను అవత లికి తీసుకుపోయి, వాళ్ళ చేతుల్లో ఉన్న తినుబండారాలు తానే తినేశాడు. తరవాత వాళ్ళను శెట్టి భార్యకు అప్పగించి, దుకా ణానికి పోయి, శెట్టిని భోజనానికి పంపి, కొట్టు మీద కూర్చుని అక్కడ తినదగినవన్నీ తలా కాస్తా నోట్లో వేసుకుని దూకాణానికి వచ్చే బేరగాళ్ళకు తక్కువ ధరకు ఎక్కువ వస్తువు లిచ్చాడు.

శెట్టి భోజనం చేసి ఇంటి నుంచి దుకా ణానికి రాగానే శేషయ్య ఇంటికి వెళ్ళి, మూడు విస్తళ్ళు కలిపి ఒకే విస్తరిగా కుట్టి తెచ్చి, భోజనానికి కూర్చున్నాడు. శెట్టి భార్య ఆ విస్తరి చూసి ఆశ్చర్యపడి, ఏమీ అనలేక, విస్తరి నిండా అన్నం రాల్చింది. శేషయ్య ఆ అన్నం తిన్నంత తిని మిగిలినది వీధిలో కుక్కలకు వేశాడు.

ఆ సాయంకాలం శెట్టి భార్య శెట్టితో శేషయ్య విస్తరి మాట చెప్పింది. ఆ రాత్రి శెట్టి, శేషయ్య భోజనానికి కూర్చున్న ప్పుడు, "ఇంత పెద్ద విస్తరి నిండా అన్నం పెట్టం," అన్నాడు.

"మీ షరతులో విస్తరి పెద్ద, చిన్న అనే మాట లేదు. కావలిస్తే నలుగురినీ పిలిచి అడుగుదాం," అన్నాడు శేషయ్య. నలుగు రికీ ఈ గొడవ తెలిస్తే తన పని నగుబాటు అవుతుందని శెట్టి మాట్లాడక ఊరుకున్నాడు.

శేషయ్య ఉదయం పూట తోటకు నీరు పోసేటప్పుడు ఒక బొక్కెన నీరు తీసుకుని,





ఇంతలో శెట్టి బావమరిదికి పెళ్ళి సంప్ర తింపులు జరుగుతూంటే, అత్తవారి ఊరు నుంచి పిలుపు వచ్చింది. శెట్టి తన వెంట శేషయ్యను కూడా బయలుదేరదీశాడు. శెట్టి భార్య తన భర్తకు కుడుములూ, చిత్రాన్నమూ మూటగట్టి, శేషయ్యకు పచ్చడి చద్ది కట్టి ఇచ్చింది. ఇద్దరూ వేకు వనే బయలుదేరారు. శెట్టి గుర్రం సవారీ అయాడు, శేషయ్య కాలినడకన వెనకగా బయలుదేరాడు.

వెనకగా వస్తున్న శేషయ్య శెట్టి మూటలో నుంచి కుడుము లన్నీ తినేశాడు. మధ్యా న్నానికి వాళ్ళు ఒక చెరువు వద్దకు చేరారు. శెట్టి కాళ్లూ, చేతులూ కడుక్కోవటానికి వెళ్ళినప్పుడు శేషయ్య శెట్టి మూట విప్పి గుర్రం ముందు వేసి, ఎటో చూస్తూ నిలబడ్డాడు.

శెట్టి తిరిగి వచ్చి, "అయ్యో, పాడు గుర్రం నా కుడుము లన్నీ తినేసింది!" అని దిగులు పడ్డాడు.

"పోనీలెండి. నా మూట నుంచి ఇద్ద రమూ తిందాము," అన్నాడు శేషయ్య.

"ఓరి అప్రాచ్యుడా, అదెలా తినేదిరా?" అని శెట్టి చిరుబురులాడాడు.

అప్పుడు శేషయ్య శెట్టితో, "అయ్య గారూ, నేను గుర్రం మీద ముందుగా మీ అత్తగారి ఊరు వెళ్ళి, మీకు భోజనంతో

చిన్న లోటాతో అన్ని మొక్కలకూ నీరు పోస్తూ వచ్చాడు.

అందుచేత నీరు చాలక తోటంతా క్రమంగా ఎండిపోయింది.

"చెట్లు ఎండుమొహం పట్టాయి. నువు నీళ్ళు పొయ్యటం లేదా?" అని యజమాని అడిగితే శేషయ్య మొక్కల మొదళ్ళలో తడి చూపాడు.

శెట్టికి శేషయ్య చేసే పని చాలొచ్చింది. కాని అతన్ని పంపేయాలంటే, నెల అయినా పూర్తి కాకుండానే నాలుగువందల రూపాయ లిచ్చుకోవాలి.

అందుచేత శెట్టి ఇరుకునపడి ఏమీ చెయ్యక ఊరుకున్నాడు.

సహా అన్ని ఏర్పాట్లూ చెయ్యమని చెప్పి, తిరిగి వస్తాను." అన్నాడు.

శెట్టి సరే నన్నాడు. శేషయ్య గుర్రం మీద శెట్టి అత్తవా రింటికి వెళ్ళి, శెట్టి మామగారితో, "మా అయ్యగారు వస్తున్నారు. వారు కొద్దిగా జబ్బు పడ్డారు. పథ్యంగా ఉన్నారు. పాత కొర్రబియ్యపు అన్నమూ, పాత చింతకాయ పచ్చడీ తింటారు. మీ మాట తీసివేయలేక వస్తున్నారు. ఈ మాట చెప్పమని నన్ను పంపారు," అని చెప్పాడు.

శెట్టి మామగారు ఈ వార్త విని చాలా చింతించాడు.

శేషయ్య వెనక్కు తిరిగి వెళ్ళి, శెట్టిని కలుసుకుని, "మీ అత్తవారింట మీ కోసం బ్రహ్మాండమైన ఏర్పాట్లు చేస్తున్నారు," అని చెప్పాడు.

శెట్టి అత్తవా రిల్లు చేరగానే, అందరూ ఆయన ఆరోగ్యం గురించి అడిగేవారే. అదేమీ అర్థం కాక శెట్టి మౌనంగా వుండిపోయాడు. తరవాత భోజనానికి కూర్చుంటే కొర్ర అన్నమూ, చింతకాయ పచ్చడీ వేశారు. అదీ శెట్టికి అర్థం కాలేదు. కాని ఆకలి మీద ఉండి అదే తినేశాడు.

దాని ఫలితంగా శెట్టికి ఆ రాత్రి కడుపులో గుడగుడ ఆరంభమయి, అతిసారళ్ళ చేసి, నీరసం పట్టుకున్నది.

శేషయ్య పక్కనే ఉండి, "రాక రాక వచ్చిన, అల్లుడికి చేసే మర్యాద ఇదేనా?" అని రోషం ఎక్కించాడు. శెట్టికి పౌరుషం



ఎక్కి, వచ్చిన పని చూడక అత్తవారింట ఎవరికీ ఏమీ చెప్పక ఇంటికి తిరుగు ప్రయాణమయాడు.

పట్నం కొద్ది దూరంలో ఉండగా శెట్టి, "ఒరే, శేషయ్యా! నువు త్వరగా వెళ్ళి, మీ అమ్మగారితో నేను వస్తున్నాననీ, స్నానానికి వేడినీళ్లూ, వేడి వేడిగా భోజనమూ తయారు చేయించమనీ చెప్పు," అన్నాడు.

శేషయ్య పరుగు పరుగున శెట్టిగారి భార్య వద్దకు వెళ్ళి, ఏడుస్తూ, "అమ్మగారూ, అయ్యగారికి గాలిసోకింది. మీరు ఆయనను చీపురుకట్టతో కొట్టాలిట!" అని చెప్పాడు. శెట్టి భార్య చేసేది లేక సరే నన్నది.

శేషయ్య లబోదిబో మంటూ శెట్టిని కలుసుకుని, "అయ్యగారూ, ఏం చెప్పమన్నారు? మనం బయలుదేరగానే అమ్మగారికి గాలిసోకిందిట. ఇల్లంతా అల్లకల్లోలంగా వున్నది. మీరు వచ్చి చీపురుకట్టతో కొట్టితే గాని దయ్యం వదిలిపోదుట!" అని చెప్పాడు.

శెట్టి ఆ మాట నమ్మి ఇంటికి వచ్చి, తన భార్యను చీపురుకట్టతో కొట్టసాగాడు. ఆమె కూడా తన భర్తను చీపురుకట్టతో కొట్టసాగింది. ఈ చీపురుకట్టల యుద్ధం చూసి ఇరుగుపొరుగు వాళ్ళు, "దీని కంతకూ కారణ మేమిటి?" అని విచారించగా శేషయ్య చేసిన మోసమంతా బయట పడిపోయింది.

"అవును. ఈ కుట్ర నాదే. పేదవాళ్ళ ఆకలిబాధ ఎలాటిదో తెలిసి రాగలందులకు ఈ విధంగా చేశాను," అని శేషయ్య జరిగిన దంతా అక్కడ చేరిన పెద్దమనుష్యులకు చెప్పాడు.

ఊరి పెద్దలు శెట్టిని గట్టిగా చివాట్లు పెట్టారు. శెట్టి శేషయ్యను పంపివెయ్యటానికి నిశ్చయించి, నాలుగువందల రూపాయలూ ఇచ్చేశాడు.

శేషయ్య తన గ్రామానికి తిరిగి వెళ్ళి, ఆ డబ్బుతో కొద్దిగా పొలం కొనుక్కుని, పెళ్ళి చేసుకుని, పొలం పని చేసుకుంటూ సుఖంగా జీవించాడు.






## 4

[ఖడ్గ జీవదత్తుల్ని చంపజూసిన ముగ్గురు ముసుగువాళ్ళూ, మహేంద్రనగరం రాజు కొడుకూ, అతడి మిత్రులూ అని బయటపడింది. పద్మపురంరాజు, మంత్రుల అనుమతితో ఖడ్గ జీవదత్తులు చచ్చిన మహేంద్రనగరం మంత్రికొడుకునూ, కాలు తెగిన ప్రతాపచంద్రుణ్ణీ రెండెడ్లబండి మీద వేసుకుని అరణ్యంకేసి బయలుదేరారు. తరవాత—]

సూర్యోదయానికి చాలా ముందుగానే ఖడ్గ జీవదత్తులు వృద్ధ పశువులకాపరి నివసించే అరణ్యప్రాంతాన్ని చేరారు. పశువులకాపరి గుడిసె వద్దకు సరాసరి బండిని తోలుకుపోవటం జీవదత్తుడికి యిష్టంలేదు. తమ కారణంగా ఆ ముసలివాడు చిక్కుల్లో తగులుకునే ప్రమాదం వున్నది.

పశువులకాపరి గుడిసెకు చాలా దూరంగా ఎడ్లబండిని ఆపి, జీవదత్తుడు, ఖడ్గవర్మను తన వెంట రమ్మనమని సౌంజ్ఞచేశాడు. ఇద్దరూ బండి దిగి అల్లంత దూరంలో వున్న ఒక చెట్టు కిందికి పోయారు. వాళ్ళచుట్టూ కన్ను పొడుచుకున్నా కానరాని అంధకారం. దూరంగా అడవిమృగాలు ఆహార సంపాదనా ప్రయత్నంలో తిరుగుతూ, భయంకరంగా అరుస్తూ వుండటం వినబడుతున్నది.

"ఖడ్గా, యిక యిప్పుడు మనం ఏంచేస్తే బావుంటుందో జాగ్రత్తగా ఆలోచించుకోవాలి.



ఈ మహేంద్రనగరం దుష్టులవల్ల అనవసరమైన చిక్కుల్లో తగుల్కున్నాం,'' అన్నాడు జీవదత్తుడు.

''ఆ మూడో ముసుగువాడు నీ అజాగ్రత్త వల్లనే పారిపోగలిగాడు. వాణ్ణి వదిలి నువ్వు ప్రహరీగోడ దగ్గరకు రావలసింది కాదు. వాణ్ణి పారిపోకుండా మనం పట్టుకోగలిగినట్టయితే, మన కెలాంటి చిక్కులూ వుండేవి కావు. వాడు బహుశా మహేంద్రనగరం పోయి, యిక్కడ జరిగినదంతా తమ రాజుకు చెపుతాడు,'' అన్నాడు ఖడ్గవర్మ.

''నాకూ అలాంటి అనుమానమే కలుగుతున్నది. తమ మధ్య శత్రుత్వం రాకుండా చూసుకునేందుకు, ఆ రాజూ, ఈ రాజూ ఏకమై హంతకులమని మన వేట సాగించినా సాగించవచ్చు,'' అన్నాడు జీవదత్తుడు.

''బాగా చెప్పావు, జీవా! ఇక పద. ఎడ్లబండినీ, అందులో వున్న శవాన్నీ, కుంటివాణ్ణీ వాళ్ళ కర్మకు వదిలి, తెల్లారే లోపల రాజ్య సరిహద్దులు దాటిపోయే ప్రయత్నం చేద్దాం,'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఇది న్యాయంగా వుంటుందా ? చచ్చినవాణ్ణీ, చావు బతుకుల మధ్య వున్నవాణ్ణీ నట్టడవిలో వదిలి....''

జీవదత్తుడు మాట ముగించేలోపలే, వెనక నుంచి నల్లని ఆకారం ఒకటి వాళ్ళను సమీపించి చిన్నగొంతుతో, ''ఎవరు ? మీరా! ఏదో ఎడ్ల గంటల చప్పుడు వినిపించి గుడిసె లోంచి బయిటికి వచ్చాను,'' అన్నది.

ఖడ్గజీవదత్తులు ఆ మాట్లాడిన ఆకారం కేసి చూశారు; అది పశువులకాపరి వృద్ధుడు.

''తాతా! ఇప్పుడు మేం చాలా కష్టంలో వున్నాం. ఆ ఎడ్లబండిని నగరాన్నుంచి యిక్కడికి తోలుకువచ్చినవాళ్ళం మేమే. దాంట్లో ఒక శవం, ఒక కాలు తెగినవాడూ వున్నారు. వాళ్ళ ఆ దుర్దశకు వాళ్ళే కారకులు, మేము నిర్దోషులం. వాళ్ళను తెల్లవారేవరకూ కాపాడే బాధ్యత నీకు ఒప్పచెప్పి, మా దారిన మేం పోదాం అని యిక్కడికి వచ్చాం,'' అన్నాడు జీవదత్తుడు.

"కాపాడటం అంటే....క్రూరమృగాల నుంచి వాళ్ళ కెలాంటి హానీ జరక్కుండానా—" అంటూ పశులకాపరి చప్పున ఎడ్ల బండి వున్న దిక్కు కేసి తల తిప్పాడు. అందుక్కారణం, ఆ వైపు నుంచి ఎలుగు బంటు గుర్ర్ అంటూ అరవటం, పెద్దపులి చిన్నగా గోండ్రించటం అతడికి వినబడింది.

ఖడ్గజీవదత్తులు కూడా అటు కేసి చూశారు. బండికి వెనకవైపు నుంచి వచ్చిన ఎలుగుబంటూ, ముందువైపు నుంచి వచ్చిన పులీ, యీసారి మరింత భయంకరంగా అరిచినై. అవి రెండూ కలియబడే ప్రయత్నంలో వున్నవి. కాని, వాటి అరుపులకు బెదిరిపోయిన బండి ఎడ్లు, బండితోపాటు అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తసాగినై.

ఇదంతా కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయింది. ఖడ్గజీవదత్తులకు యిప్పుడు ఎడ్ల మెడల్లోని గంటలచప్పుడూ, ఎలుగుబంటూ, పులీ కలియబడి భయంకరంగా అరుస్తూ పోరాడుతూండటం మాత్రం కనబడింది.

"మన సమస్యకు దేవుడే పరిష్కార మార్గం చెప్పాడు, జీవా!" అన్నాడు ఖడ్గవర్మ ఉత్సాహంగా.

"అలాగే కనబడుతున్నది. కాని, పాపం, ఆ కాలు తెగిన రాజకుమారుడు...."

జీవదత్తుడి మాటకు అడ్డొస్తూ పశుల కాపరి వృద్ధుడు, "రాజకుమారుడా! ఏ దేశపు రాజకుమారుడు? అసలేం జరిగింది? ముందు యీ పులీ, ఎలుగుల్ని యిక్కణ్ణించి తరమటం మంచిది," అన్నాడు.





ఖడ్గవర్మ చెట్టు కింద వెతికి లావుపాటి ఒక ఎండుపుల్ల తీసుకుని, పెద్దగా కేక పెడుతూ దాన్ని గురి చూసి పోట్లాడు కుంటున్న పులీ, ఎలుగుబంట్ల మీదికి విసి రాడు. ఆ ఎండుపుల్ల వచ్చి బలంగా తగల గానే పులీ, ఎలుగులు చెరొక దిక్కుకూ పారిపోయాయి.

జీవదత్తుడు, వృద్ధుడికి ఆ రాత్రి నగరం లోని రాజుగారి అతిథి గృహంలో జరిగిన సంఘటనలన్నీ టూకీగా చెప్పాడు. అంతా విన్న వృద్ధుడు ఓ క్షణం ఆలోచిస్తూ వూరు కుని, తరవాత ఖడ్గజీవదత్తులతో, "మీరు తక్షణం యీ రాజ్య సరిహద్దులు దాటి పోవటం మంచిది. మా మహారాజు కంటె మహేంద్రనగర రాజు బలవంతుడు. ఆయ నకు జరిగిన సంగతి తెలిస్తే, మా రాజు ద్వారా మిమ్మల్ని పట్టుకునేందుకు తప్పక ప్రయత్నం చేస్తాడు," అన్నాడు.

ఖడ్గజీవదత్తులను మొదటి నుంచీ యిలాంటి అనుమానమే పట్టి పీడుస్తున్నది. వాళ్ళు వృద్ధుడికి నమస్కరించి, మళ్ళీ ఏదో ఒకనాడు అతణ్ణి చూచేందుకు రాగలమని చెప్పి, ఆ చీకట్లోనే త్వరత్వరగా అడవి మార్గాన బయలుదేరారు. తెల్లవారే లోపుగా పద్మపురనగరాన్నుంచి ఎంత దూరంగా పోగలిగితే అంత క్షేమమని వాళ్ళు నిశ్చ యించుకున్నారు.

కాని, పారిపోయిన మహేంద్రనగర సేనాని పెద్దకొడుకు రాత్రి మూడవ జామునే తన నగరం చేరి, ముందుగా తన తండ్రికి జరిగినదంతా తెలియపరిచాడు. రాజకుమా రుడూ, మంత్రికుమారుడూ పరాయి రాజ ధానిలో చిక్కుల్లో తగుల్కున్నారని తెలియ గానే సేనాని అప్పటికప్పుడే పోయి జరిగిన దంతా రాజుకూ, మంత్రికీ చెప్పాడు.

రాజూ, మంత్రీ సేనానికొడుకును కూడా పిలిపించి జరిగిందేమిటో వివరంగా చెప్ప మన్నారు. అతను మంత్రికొడుకు దండం దెబ్బతిని కిందపడిపోవటం చూశాననీ, తర వాత రాజుకొడుకు ప్రహరీగోడ దూకిన సూచనా, గాయపడినట్టుగా అరవటం విన్నా

ననీ : ఆ సమయంలో తనను కాపలా కాస్తున్నవాడు బయిటికి పోవటంతో, తాను మరొక వైపున ప్రహరీగోడ దూకి పారిపోయి వచ్చాననీ చెప్పాడు.

సేనానికొడుకు యిన్ని వివరాలూ రాజుతో చెప్పాడుగాని, తాము మునుగులు వేసుకున్న సంగతీ, అసలు తాము ముగ్గురూ పద్మపురం ఎందుకు వెళ్ళిందీ మాత్రం చెప్పలేదు. ఎవరో క్షత్రియయువకులు యిద్దరు తమను ఆహ్వానిస్తే, అతిథి గృహానికి పోయామని బొంకాడు.

మహేంద్రనగర రాజుకూ, అయన మంత్రికీ యీ వార్త చాలా ఆదుర్దా కలిగించింది. ఇప్పుడు తమ పుత్రులు ఎలాంటి చిక్కుల్లో వున్నారో, అసలు బతికే వున్నారో లేదో అన్న భయం కూడా వాళ్ళను పట్టుకున్నది. రాజూ, మంత్రీ సంప్రతించుకుని ఒక దూతను అప్పటికప్పుడే పద్మపురానికి ప్రయాణం కట్టించారు. పద్మసేన మహారాజుకు యివ్వవలసిందిగా అతడికి ఒక లేఖ యిచ్చారు.

ఆ రాజదూత గుర్రం మీద బయలుదేరి సూర్యోదయం అయిన కొద్దిసేపటికి పద్మపురం చేరి, తమ రాజు యిచ్చిన లేఖను పద్మసేన మహారాజుకు అందించాడు. ఆ లేఖలో మహేంద్రనగర రాజు తన కుమారుణ్ణీ, మంత్రి కుమారుణ్ణీ వెంటనే తన



నగరానికి పంపవలసిందిగా రాస్తూ, వాళ్ళకు హాని తలపెట్టిన ఇద్దరు క్షత్రియయువకుల్నీ కూడా తగిన విధంగా శిక్షించేందుకు తనకు ఒప్పచెప్పవలసిందిగా కోరాడు.

పద్మసేనుడు ఆ లేఖ చదివి, సేనాని కొడుకు ప్రాణాలతో బయటపడ్డాడనీ, కాని అతడికి మంత్రికొడుకు మరణం, రాజు కొడుకు కాలు తెగిపోవటం తెలియదనీ గ్రహించాడు. ఆయన వెంటనే తన మంత్రి కోసం కబురుచేసి, మహేంద్రనగర దూతను అతిథిగృహానికి పంపాడు.

మంత్రి సోమదేవుడు రాజు దగ్గిరకు వచ్చాడు. లేఖలోని విషయమంతా ఒకటికి రెండుసార్లు చదివాడు. తరవాత దీర్ఘంగా



ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి రాజుతో యిలా అన్నాడు: "మహారాజా! మహేంద్రవర్మ రాజుకు యిక్కడ జరిగిపోయిన సంఘటనల పూర్తి వివరాలు తెలియవన్నది, యీ లేఖ ద్వారా మనకు అర్థమవుతున్నది. మనం ఒక పని చేద్దాం. ఆ క్షత్రియ యువకు లిద్దరూ తెల్లవారేసరికి అతిథి గృహంలో నుంచి ఎటో వెళ్ళిపోయారనీ, రాత్రి ఆ గృహంలో జరిగిన ఘటన లేవీ మనకు తెలియవనీ—అయినా ఆ క్షత్రియ యువకుల్ని పట్టుకునేందుకూ, రాజకుమారుడూ, మంత్రికుమారుడూ ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకూ ప్రయత్నిస్తామనీ ప్రత్యుత్తరం రాద్దాం."

"బాగానే వుంది. కాని, నిర్దోషులైన ఆ ఖడ్గ, జీవదత్తుల్ని వెతికిపట్టుకుని ఆ మహేంద్రవర్మకు ఒప్పచెప్పటం ఎలా? అది వాళ్ళకు మరణ శిక్ష విధించటంతో సమానం అవుతుందిగదా?" అన్నాడు రాజు.

"అలాంటి ప్రమాదం రాకుండా ఒక ఉపాయం వుంది. ఆ ఖడ్గ జీవదత్తుల పేర్లు గాని, రూపురేఖలుగాని బాగా ఎరిగినవాళ్ళు బహు కొద్దిమంది మాత్రమే. వాళ్ళంతా మన పౌరులూ, రాజప్రాసాద ఉద్యోగులూ. కనక, మనం ఆ యువకుల పేర్లు మార్చి, ఆకార విశేషాల్లో ఏదో ఒక లోపం వున్నట్టు చెప్పి, ఆ మహేంద్రవర్మను తప్పు దారిన పెడదాం. మంత్రికొడుకు శవం, ఒంటికాలి రాజకుమారుడూ యిప్పు డే స్థితిలో ఎక్కడున్నారో మనకే తెలియదు గదా!" అన్నాడు మంత్రి సోమదేవుడు.

"అదంతా జాగ్రత్తగా ఆలోచించి, లేఖ రాసి, ఆ వచ్చిన రాజదూత ద్వారా మహేంద్రవర్మకు పంపండి. ఏది ఏమైనా ఆ ఖడ్గ, జీవదత్తులు మాత్రం చిక్కుల్లో పడరాదు. వాళ్ళు నిజంగానే మహావీరులు! పద్మావతి అడిగినట్టు వాళ్ళలో ఏ ఒకరో తప్పక వింధ్యపర్వతాల్లోని రాతిరథాన్ని కదిలించవచ్చు—అలా జరిగితే రాజ్యభారం అల్లుడి మీద వేసి, విశ్రాంతి తీసుకుంటాను," అన్నాడు పద్మసేన రాజు.

మంత్రి సోమదేవుడు లేఖ రాసి, దానిని రాజుకు చూపించి, ముద్రవేసి, మహేంద్ర వర్మ దూతకు యిచ్చాడు. ఆ దూత వెంటనే బయలుదేరి సాయంకాలానికల్లా నగరం చేరి, తమ రాజుకు దాన్ని అందించాడు.

మహేంద్రవర్మా, అయన మంత్రీ లేఖ లోని విషయం చదివి తికమకపడ్డారు. తమ పుత్రులూ, ఆ క్షత్రియయువకులూ అయిపూ అజా లేకుండా పోవటం వాళ్ళను ఆశ్చర్యపరిచింది. కాని, లేఖలో ఆ క్షత్రియ యువకుల పేర్లూ, వాళ్ళను గుర్తించి పట్టు కునేందుకు అవసరం అయిన రూపురేఖల వివరాలూ చూసి, వాళ్ళు తృప్తిపడ్డారు.

మంత్రి సోమదేవుడు, ఖడ్గజీవదత్తుల పేర్ల బదులు వీరభద్రుడూ, రామభద్రుడూ అనీ, వాళ్ళల్లో వీరభద్రుడికి కుడి కన్ను మెల్ల అనీ, రామభద్రుడి ఎడమ చేతికి ఆరు వేళ్ళు వుంటాయనీ లేఖలో రాశాడు. అంతే కాక వాళ్ళను పట్టుకునేందుకు రాజభటులు దేశమంతా గాలించబోతున్నారనీ, గ్రామ గ్రామానా వాళ్ళ ఆ చూకీ తెలుసుకునేం దుకు చాటింపు కూడా వేయిస్తున్నాననీ మహేంద్రవర్మకు తెలియపరిచాడు.

"మహామంత్రీ! ఇక ఆ దుష్ట క్షత్రియ యువకు లిద్దరూ మనకు దొరికినట్టే. పోతే మన పిల్లల సంగతే తెలియటం లేదు. వాళ్లు రహస్యంగా మారువేషాలు వేసుకుని మన




నగరానికి బయలుదేరి వుంటారని మీ అభి ప్రాయమా?" అని అడిగాడు మహేంద్రవర్మ.

మంత్రి వామపాలుడు కొంచెం సేపు మౌనంగా వూరుకుని, "మన పిల్లలలో యింకా ఆకతాయితనం పోలేదు, మహా రాజా! వాళ్ళిద్దరూ ఆ క్షత్రియ యువకు లతో కలిసి, దేశాటనకు పోయినా పోయివుండ వచ్చు. అసలు వీళ్ళ మధ్య విరోధానికి కారణం ఏమిటో సేనాని కొడుకు మాటల వల్ల నాకేం అర్థం కాలేదు. అతడు మన వాళ్ళకన్న కూడా దుందుడుకు స్వభావం కలవాడు," అన్నాడు.

"నిజం నిలకడమీద తెలుస్తుంది, అన్నారు పెద్దలు. మన రాజ్యంలో కూడా

ఆ వీరభద్ర రామభద్రుల్ని పట్టుకునేందుకు చాటింపు వేయించటం బాగావుంటుంది," అన్నాడు మహేంద్రవర్మ.

ఆ నాటి సాయంత్రంవేళ పద్మపుర, మహేంద్రనగర రాజ్యాల్లోని పల్లె పట్టణాల్లో వీరభద్ర, రామభద్రుల పోలికల్ని చెప్పి, వాళ్ళను పట్టుకున్నవాళ్ళకు గొప్ప బహుమానం వుంటుందని రాజభటులు చాటింపు వేయసాగారు.

పద్మపురానికి చాలా దూరంగా వున్న ఒక పల్లెలోని పూటకూళ్ళ యింట వున్న ఖడ్గ, జీవదత్తులు, యీ చాటింపు విని దీని వెనక ఏదో రహస్యం వున్నదనీ, ఇది బహుశా తమను జాగ్రత్తపడవలసిందిగా పద్మసేన రాజు చేస్తున్న హెచ్చరిక కావచ్చనీ అనుమానించారు.

ఖడ్గవర్మకు తక్షణం ఆ పల్లె వదిలి పోవటం క్షేమం అన్న అభిప్రాయం కలిగింది. కాని జీవదత్తుడు అలా చేయటం అనుమాన కారణం అవుతుందనీ, సూర్యాస్తమయం తర్వాత బయలుదేరి, ఆ రాత్రి అరణ్యంలో గడిపి, మర్నాటి పగటివేళ ఏదో విధంగా పద్మపుర రాజ్య సరిహద్దులు దాటే ప్రయత్నం చేద్దామనీ అన్నాడు.

ఇద్దరూ యిలా మాట్లాడుకుంటున్నంతలో తలారు లిద్దరు పూటకూళ్ళ ఇంటికి వచ్చి, ఇంటి యజమానిని, ఆ ఉదయం వచ్చిన యువకులిద్దరూ ఎక్కడ వున్నారని ప్రశ్నించారు. చాటింపు విని వున్న పూటకూళ్ళ ఇంటివాడు భయపడిపోతూ, "లోపలే వున్నారు! పిలుచుకు వస్తానుండండి," అంటూ ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వచ్చాడు.

తలార్లు అడిగిన ప్రశ్న విన్న ఖడ్గజీవ దత్తులు ఇంట్లో నుంచి బయిటికి వచ్చారు. తలారు లిద్దరూ వాళ్ళను నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "బయలుదేరండి, గ్రామాధికారి మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నాడు," అన్నారు.

"అలాగా! వస్తున్నాం, దారితీయండి!" అన్నాడు జీవదత్తుడు. ముందు తలార్లూ, వెనకగా ఖడ్గజీవదత్తులూ గ్రామకచ్చేరీ కేసి నడవసాగారు. —(ఇంకా వుంది)






# హస్తవాసి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మానవాతీతమైన పనులు సాధించాలంటే మానవాతీతమైన శక్తులుండాలి. అవి ఉన్ననాడు శ్రమ లేకుండా ఎలాటి పనులైనా చెయ్యవచ్చు. ఇందుకు నిదర్శనంగా నీకు గోవర్ధను డనే కుర్రవాడి కథ చెబుతాను, శ్రమతెలియ కుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒక సంపన్నమైన గ్రామంలో ఒక ధని కుడు ఉండేవాడు. ఆయన ఇంట వయసు మళ్ళిన దంపతు లిద్దరు పనిచేస్తూ ఉండే వాళ్ళు. వాళ్ళుండే ఇల్లు ధనికుడి ఇంటి ఆవరణను అనుకునే ఉండేది. వాళ్ళ కొడుకులు పెద్దవాళ్ళయి, తమ పొట్ట తామే పోసుకుంటామని గ్రామాంతరాలకు వెళ్ళి

## బేతాళ కథలు




పోయారు. అందుచేత వాళ్ళు ఒంటరితనంతో బాధపడుతూ వచ్చారు.

ఈ స్థితిలో ఆ వయసు మళ్ళిన దంపతులకు ఒక కొడుకు మళ్ళీ కలిగాడు. వాడే గోవర్ధనుడు. గోవర్ధనుడు పుట్టిన ఘడియలోనే ధనికుడిభార్య ఒక ఆడపిల్లను కన్నది. ఆమెకు లీల అని పేరు పెట్టుకున్నారు.

ఒకేసారి పుట్టిన లీలా గోవర్ధనులకు ఏదో సంబంధం ఉన్నట్టుగా అందరూ భావించారు. ఆ ఇద్దరూ కలిసే పెరిగారు. కలిసి ఆడుకున్నారు. ఒకరి మీద ఒకరు మమకారం పెంచుకున్నారు. ముఖ్యంగా లీల గోవర్ధనుడు పక్కన ఉంటేనేగాని ఏమీ చెయ్యలేకపోయేది.

ధనికుడికి ఒక బండీ ఉండేది. రోజూ సాయంత్రం పూట లీల ఆ బండీలో విహారానికి బయలుదేరేది. గోవర్ధనుడు కూడా తన వెంట బండీలో వస్తేనేగాని ఆమె ఊరుకునేది కాదు.

రోజూ తన కుమార్తె తన నౌకర్ల కొడుకుతో బండీలో తిరుగుతున్నదని ధనికుడికి తెలియగానే ఆయన చిరాకుపడి తన బండీలో గోవర్ధనుడు తిరగటానికి వీలు లేదని ఉత్తరువు చేశాడు. వెంటనే లీల బండీలో తిరగటం మానేసింది.

గోవర్ధనుడూ, లీలా ఒక్క గురువు దగ్గిరే చదువుకునేవారు. చదువుకోవటానికి బయలుదేరేటప్పుడు లీల చిరుతిళ్ళు జాస్తిగా తీసుకుపోయి, వాటిలో గోవర్ధనుడికి వంతుపెట్టేది.

ఒకనాడు ధనికుడి భార్య తన భర్తతో, "మన లీల ఇంటి దగ్గిర తినే తిండి కన్న చిరుతిళ్ళు రెట్టింపు తింటున్నది. ఏ మాశ్చర్యం!" అన్నది.

ఆమె తన చిరుతిళ్ళు గోవర్ధనుడికి పంచి ఇస్తున్నదన్న సంగతి తెలిసి ధనికుడు గోవర్ధనుడి తండ్రితో, "నీ కొడుకును చదువు మానిపించు. రేపు చేతులు బురద చేసుకోబొయ్యేవాడికి చదువెందుకు?" అన్నాడు.

"పొలంపనులు చేసే ఈడువచ్చేసరికి చదువే ఉండదు. అందాకానన్నా నాలుగక్ష

రాలు వంటబట్టనియ్యండి,'' అన్నాడు గోవర్ధనుడి తండ్రి.

''చదివినది చాలు. రేపటి నుంచీ వాణ్ణి గొడ్లు కాయటానికి పంపిస్తున్నాను,'' అన్నాడు యజమాని.

మర్నాటి నుంచీ గోవర్ధనుడు చదువు మాని గొడ్లను వెంటపెట్టుకుని బీడు మీదికి వెళ్ళాడు. ఈ సంగతి తెలిసి లీల చదువు కోవటానికి వెళ్ళటం మాని, గోవర్ధనుడు గొడ్లుకాసే చోటికి పోయింది. చెట్టు కింద కూర్చుని ఇద్దరూ కబుర్లు చెప్పుకున్నారు. లీల తెచ్చిన ఆహారం ఇద్దరూ తిన్నారు.

ఇలా మూడు రోజులు జరిగినాక చదువు చెప్పే గురువుగారు ధనికుడి వద్దకు వచ్చి, ''మీ లీల మూడు రోజులుగా చదువుకోను రావటం లేదు. ఆ పిల్లకు జబ్బుగాని చెయ్యలేదు కద?'' అని అడిగాడు.

ధనికుడు ఆ మాటకు ఆశ్చర్యపోయి లీలను పిలిచి అడిగితే, ''గోవర్ధనుడు బడి మానాడుగా? నేనూ మానేశాను!'' అన్నది.

ధనికుడికి తన కూతురి వ్యవహారం శ్రుతిమించి రాగాన పడుతున్నదనిపించింది. అయన గోవర్ధనుడి తండ్రిని పిలిచి, ''ఇక నీ కొడుకు ఈ వూళ్ళో ఉండటానికి వీల్లేదు. ఎక్కడికైనా పంపించు,'' అన్నాడు.

''పెద్ద పిల్లలు మమ్మల్ని విడిచి ఏనాడో వెళ్ళారు. పసివాడు, వీణ్ణి కూడా మాకు



దూరం చెయ్యకండి,'' అని ముసలివాడు ప్రాధేయపడ్డాడు.

''మీకు కొడుకే కావాలంటే అంతా కట్టకట్టుకుని వెళ్ళిపొండి. మిమ్మల్ని ఈ గ్రామంలో బతకనివ్వను,'' అన్నాడు ధనికుడు.

యజమాని ఇలా అంటున్నాడని విన గానే గోవర్ధనుడు, ''నేను వెళ్ళిపోతానులే, నాన్నా. నా గురించి ఏమీ దిగులు పడ వద్దు,'' అన్నాడు.

వాడు లీలకు వీడ్కోలు చెప్పటానికి పోయినప్పు డామె, ''నువు పెద్దవాడివై తిరిగివస్తావు కాదూ? నేను నీ కోసం కని పెట్టుకుని ఉంటాను. పెద్దయాక మనం



పెళ్ళి చేసుకుందాం. ఈ మాట మరిచి పోకు!" అన్నది.

గోవర్ధనుడు ఇంటి నుంచి బయలుదేరి చాలా దూరం నడిచి ఒక రోజు సాయంకాలానికి ఒక పెద్ద వాగు వద్దకు చేరాడు. ఆ వాగు మీద ఒక ఇరుకైన వంతెన ఉన్నది. వాడు దాని మీదుగా వాగు దాటి అవతలి పక్కకు పోదామనుకుంటూండగా ఒక ముసలిది తన చేతిలో ఉన్న బెత్తం ఎత్తి, "ఆగు, ముందు నా బాతులను దాటనీ!" అన్నది.

గోవర్ధనుడు ఆమె వెంట ఉన్న బాతుల మందను చూసి ఆగాడు. వంతెన ఇరుకు కావటంచేత బాతులు ఒకదాని వెనక ఒకటిగా వంతెన మీదుగా రాసాగాయి. ఎంత సేపు చూసినా బాతు లింకా వస్తూనే ఉన్నాయి. ఒక చెంప చీకటి పడుతున్నది. అలిసి ఉన్న గోవర్ధనుడు ఒక చెట్టు మొదలుకు చేరగిలబడి అలాగే నిద్రపోయాడు.

వాడు తిరిగి నిద్ర మేలుకునేసరికి బాతు లింకా వంతెన మీదుగా వస్తూనే ఉన్నాయి. అవి దాటటం ముగియగానే ముసలిది వాటి వెనకగా వచ్చి, గోవర్ధనుడి దగ్గిర నిలిచి, "బాతులు దాటాయి. ఇక నువు పోవచ్చు. ఆలస్యమయిందని విసుక్కున్నావు కాదూ?" అని అడిగింది.

"నాకు మించిపోయే పనేమీ లేదు. బతుకుతెరువు వెతుక్కుంటూ పోతున్నాను," అన్నాడు గోవర్ధనుడు.

"వివేకం గలవాళ్ళు తొందరపడరు; మర్యాద గలవాళ్ళు విసుక్కోరు. చెయ్యి చాచు, నీకు హస్తలాఘవం ఇస్తాను," అన్నది ముసలిది.

గోవర్ధనుడు కుడి చెయ్యి చాచాడు. ముసలిది తన బెత్తంతో చేతి మీద వాత తేలేటట్టు కొట్టి, "ఇక వెళ్ళు. నువ్వేం చేసినా దానికి తిరుగుండదు," అంటూ ఎటో వెళ్ళిపోయింది.

గోవర్ధనుడు, "ముసలిముండ మహా చెడ్డది!" అనుకుని, వాగు దాటి ఆ సాయంకాలానికి ఒక మహానగరం చేరాడు. అక్కడ

అతను ఒక స్వర్ణకారుడి ఇంటి ముందు ఆగి, "నాకు పని నేర్పిస్తారా?" అని స్వర్ణకారుణ్ణి అడిగాడు.

"అలాగే నేర్పుతాను. శ్రద్ధగా పనిచేశావంటే పైకి రావచ్చు." అన్నాడు స్వర్ణకారుడు. అయన గోవర్ధనుణ్ణి ఒక గదిలోకి తీసుకుపోయి, అక్కడ పని చేసేవాళ్ళను చూపి, "ఒక ఏడాది పని నేర్చుకుంటే వీళ్ళు చేసే పని చెయ్యగలుగుతావు," అన్నాడు. తరవాత మరొక గదికి తీసుకుపోయి, "ఇక్కడ పని చేసేవాళ్ళతో సమంగా పని చేయాలంటే నీకు కనీసం నాలుగేళ్ళు పట్టుతుంది," అన్నాడు. తరవాత అయన గోవర్ధనుణ్ణి తన గదికి తీసుకుపోయి, "ఇది నేను పని చేసేచోటు. ఇది నేను రాజుగారికి కొత్తగా తయారుచేస్తున్న కిరీటం. జన్మ అంతా ధారపోసినా నీకీ పని రాకపోవచ్చు. ఈ మహానగరంలో నాతో సమానమైన పనివాడు లేడు. అందుకే రాజుగారు నాకీ పని అప్పగించారు," అన్నాడు.

"ఈ పని నేనూ చెయ్యగలను," అన్నాడు గోవర్ధనుడు, సగం తయారైన కిరీటాన్ని తిప్పి, తిప్పి చూస్తూ.

స్వర్ణకారుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది.

"గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిందని, నా దగ్గిర పని నేర్చుకునేటందుకు వచ్చి నా పనే చేస్తానంటావా? ఏదీ, చెయ్యి? ఈ కిరీటం పూర్తి చేసేదాకా నిన్నీ గది కదలనియ్యను," అంటూ స్వర్ణకారుడు గది






నుంచి బయటకు పోయి, తలుపుగొళ్ళెం పెట్టేశాడు.

మర్నాడు ఆయన గొళ్ళెం తెరిచి ఆ గదిలో ప్రవేశించేసరికి, రాజుగారి కిరీటం తయారై, పొదిగిన రత్నాలతో మిలమిలా మెరుస్తూ గోవర్ధనుడి చేతిలో కనిపించింది. స్వర్ణకారుడు నిర్ఘాంతపోయి ఆ కిరీటాన్ని లాక్కుని జాగ్రత్తగా పరిశీలించాడు. చేతలో ఏమీ లోపం లేదు. తాను నాలుగు వారాలలో చేసే పనిని ఈ పని నేర్చుకునేవాడు ఒక్క రాత్రిలో ఎలా చేశాడో ఆయనకు అర్థం కాలేదు.

''ఒరే, బాబూ! నువ్వింత పనిమంతుడివని నాకు తెలీదు. నువు మరెక్కడికి పోక, నా దగ్గరే ఉండి పని చెయ్యి. నా సంపాదనలో నీ వంతు న్యాయంగా ఇస్తాను,'' అన్నాడు స్వర్ణకారుడు.

గోవర్ధనుడు సరేనన్నాడు. అయితే స్వర్ణకారుడు అతన్ని మోసం చేస్తూ వచ్చాడు. రాజుగారు కొత్త కిరీటానికిచ్చిన డబ్బులో గోవర్ధనుడికి ముట్టినది బహు కొద్ది. అయినా స్వర్ణకారుడిచ్చేదే చాలా ఎక్కువ అనిపించి గోవర్ధనుడు తన డబ్బు భద్రంగా దాచుకోసాగాడు. అయితే తనను స్వర్ణకారుడు స్పష్టంగా మోసగిస్తున్నాడని తెలిసిపోయాక అతనికి అక్కడ ఉండ బుద్ధి కాలేదు.

గోవర్ధనుడు స్వర్ణకారుణ్ణి విడిచిపెట్టి నగరమంతా తిరుగుతూ, ఒక శిల్పి పని చేసేచోటికి వచ్చాడు. ఆ శిల్పి గోవర్ధనుడికి పని నేర్పటానికి ఒప్పుకుని, తాను గుడికి తయారుచేస్తున్న పూజావిగ్రహాలను గోవర్ధనుడికి చూపి, ''రాజుగారి కుమార్తెకు పెద్ద జబ్బు చేసింది. గుడి కట్టిస్తే ఆమెకు నయమవుతుందని చెప్పారుట. ఆ గుడి తయారయింది. పూజావిగ్రహాలను నన్ను తయారు చెయ్యమన్నారు," అని చెప్పాడు.

''వీటిని నేనే తయారుచేయగలను,'' అన్నాడు గోవర్ధనుడు.

శిల్పికి చాలా కోపం వచ్చింది. అతను గోవర్ధనుడితో, ''అంతటివాడివా? అయితే

సాయంకాలం లోపల వీటిలో ఎన్ని పూర్తి చేస్తావో చూస్తాను," అని వెళ్ళిపోయాడు.

గోవర్ధనుడు అక్కడ ఉన్న ఉలులూ, చేసమ్మెటా తీసుకుని ఒక్కొక్క విగ్రహాన్నే పూర్తి చెయ్యసాగాడు. అకస్మాత్తుగా, అతను పూర్తి చేసిన దేవీవిగ్రహం నోరు తెరిచి, "నాయనా, నువు సిద్ధహస్తుడివి. నీ ఉలితో చచ్చినవాళ్ళకు గాటుపెడితే వాళ్ళు తిరిగి బతుకుతారని నీకు వరం ఇస్తున్నాను!" అని మళ్ళీ విగ్రహంలాగా అయిపోయింది.

సాయంకాలం శిల్పి వచ్చి చూసేసరికి విగ్రహాలన్నీ జీవంతో తొణికిసలాడుతూ తయారై ఉన్నాయి. శిల్పి గోవర్ధనుడి చేతులు పట్టుకుని, "బాబూ, నువు మయుడి అంశనా, విశ్వకర్మ అంశనా పుట్టినవాడివిగాని సామాన్యుడివి కావు. నా దగ్గిరే ఉండి పని చేసి, నా సంపాదనలో న్యాయమైన వాటా తీసుకో!" అన్నాడు.

గోవర్ధనుడు సరే నన్నాడు.

విగ్రహాలను కొత్త గేవాలయంలో ఉంచి, రాజపురోహితుడే స్వయంగా ప్రాణప్రతిష్ఠ చేశాడు. కాని రాజకుమార్తెకు వ్యాధి నయం కాకపోగా ఆమె చనిపోయింది.

రాజుకు దుఃఖంతోబాటు కోపం కూడా వచ్చింది. ఆయన పురోహితుణ్ణి పిలిచి, "ఇలా ఎందుకు జరిగింది? నన్ను మీరంతా మోసం చేశారు. గుడి కట్టించమని నాకు సలహా ఇచ్చిన వాళ్ళనందరినీ తలలు తీయిస్తాను," అన్నాడు.





రాజపురోహితుడు కంగారుపడి, "మహా రాజా, ఈ దోషం శిల్పి చేసిన విగ్రహాలలోనే ఉండి ఉంటుంది," అన్నాడు.

రాజభటులు వెళ్ళి శిల్పిని పట్టుకు వచ్చారు. శిల్పి ప్రాణభయంతో వణికిపోతూ, "మహారాజా, విగ్రహాలలో ఏదన్నా దోషం ఉంటే దానికి నేను బాధ్యుణ్ణి కాను. వాటిని తయారు చేసినవాడు నా వద్ద పని నేర్చుకునే కుర్రవాడు," అన్నాడు.

రాజు, భటులను పంపి గోవర్ధనుణ్ణి పిలిపించాడు. అతను రాజుతో, "మహారాజా, విగ్రహాలను చేసినది శిల్పి కాదు. నేనే. వాటిలో దోష మేమీలేదు. రాజకుమార్తె చనిపోయిన మాట నిజం కాదేమోనని నా అనుమానం. ఒక్క క్షణంపాటు నన్నామెను చూడనిస్తారా?" అన్నాడు.

అందువల్ల నష్టం లేదనుకుని రాజు గోవర్ధనుణ్ణి రాజకుమార్తె శవం ఉన్న గదిలోకి పంపాడు. గోవర్ధనుడు అక్కడ వున్న వారి నందరినీ బయటికి పంపి, రాజకుమార్తె కాలి మీద తన ఉలితో చిన్న గాటు పెట్టాడు. వెంటనే రాజకుమార్తె ప్రాణం వచ్చి లేచి, గోవర్ధనుడి వెంట తన తండ్రి వున్న చోటికి వచ్చేసింది.

రాజు గోవర్ధనుణ్ణి కౌగలించుకుని ఆనంద బాష్పాలు రాల్చాడు. ఆయన అతనికి అంతులేని బహుమతు లిచ్చి సన్మానించాడు.

ఇప్పుడు గోవర్ధనుడు గొప్ప సంపన్నుడు. నగరంలో వున్న కాలంలో అతను పెరిగి యుక్తవయస్కుడు కూడా అయాడు. అతనికిప్పుడు తన గ్రామానికి తిరిగిపోయి, లీలను పెళ్ళాడి సుఖంగా ఉండాలన్న కోరిక కలిగింది. రాజుగారు తనకు బహుమానంగా ఇచ్చిన ధనమంతా గుర్రం మీద వేసుకుని అతను గ్రామానికి బయలుదేరాడు.

అతను గ్రామాన్ని చేరవస్తుండగా చెట్ల మధ్య ఒక తెల్లని కట్టడం కనిపించింది. దాని నాలుగు పక్కలలోనూ ఒక్క ద్వారం కూడా లేదు. అది పూర్వం ఉన్నది కాదు. ఆ కట్టడం ఏమైఉంటుందా అని అతను ఆలోచిస్తూ ఉండగా, పూర్వం తనను చేతి

మీద బెత్తంతో కొట్టిన ముసలిది ఎక్కడి నుంచో ఊడిపడి, "ఓహెూ, నువా? మహా రాజులాగా తయారయావే!" అంటూ బోసి నోరు విప్పి నవ్వింది.

"అంతా నీ చలవే, అవ్వా! నీకూ ఇందులో భాగం ఉంది," అంటూ తన ధనపు సంచులు చూపాడు గోవర్ధనుడు.

"నాకు డబ్బు దేనికిగాని, నువు వూళ్ళోకి పోయి సంతోషించలేవు. నీ తల్లీ, తండ్రీ బూడిద అయిపోయారు. నువు ముఖ్యంగా చూడాలనుకుంటున్న స్నేహితురాలు కూడా చచ్చిపోయింది. ఆమెకు బలవంతంగా పెళ్ళిచేయాలని ఆమె తలిదండ్రులు ప్రయత్నించారు. ఆమె ఆత్మహత్య చేసుకుంటూ, తనను ఈ వనం మధ్య సమాధి చెయ్యాలని ఉత్తరం రాసిపెట్టింది. తల్లిదండ్రులు ఆమెను ఒక పెట్టెలోపెట్టి సమాధిచేశారు. ఇదే ఆమె సమాధి," అన్నది ముసలిది.

"లీలను బతికించుకుంటాను. కాని లోపలికి మార్గంలేదే!" అన్నాడు గోవర్ధనుడు.

ముసలిది తన బెత్తంతో సమాధి గోడను కొట్టింది. వెంటనే కొంత గోడ ఒరిగిపడిపోయింది. లోపల పెట్టె ఉన్నది. దాని మూత ఎత్తి చూస్తే లీల నిద్రపోతున్నదానిలాగా కనబడింది. గోవర్ధనుడు తన ఉలి పైకి తీసి, దానితో లీల కాలి మీద చిన్న గాటు పెట్టాడు. వెంటనే లీల నిద్ర లేచి




నట్టుగా లేచి కూర్చుని, గోవర్ధనుడి కేసి ఆశ్చర్యంగా చూసింది.

"నన్ను గుర్తించలేదా, లీలా? నేను గోవర్ధనుణ్ణి!" అన్నాడు గోవర్ధనుడు. లీల ముఖం ఆనందంతో వికసించింది. గోవర్ధనుడు తన చేతిలో ఉన్న ఉలి అవతలికి విసిరివేసి, లీలను కౌగలించుకున్నాడు.

"నువు తిరిగివస్తావని నాకు తెలును. మా అమ్మా, నాన్నా నాకు బలవంతంగా పెళ్ళి చేయాలనుకున్నారు. అందుచేత, ప్రాణంపోయినట్టు కనిపించే ఒక ఔషధం తాగి, నన్ను భద్రంగా సమాధి చేయటానికి ఏర్పాటు చేసుకున్నాను. నేను నిజంగా చావలేదు," అన్నది లీల.

ఇద్దరూ, కలిసి సమాధి దాటి ఇవతలికి వచ్చారు.

"నువు బతికే ఉన్నావంటే మీ అమ్మా, నాన్నా సంతోషిస్తారు. మీ ఇంటికి పోదాం పద!" అన్నాడు గోవర్ధనుడు.

"నేను మా ఇంటికి మరి రాను. మనం ఇంకెక్కడికైనా పోయి సుఖంగా బతుకుదాం పద," అన్నది లీల.

"అన్నట్టు నా ఉలి సమాధిలోనే ఉండిపోయింది. తీసుకువస్తాను," అంటూ గోవర్ధనుడు సమాధిని సమీపించాడు. కాని పడిపోయిన సమాధి గోడ తిరిగి నిలిచినట్టున్నది. లోపలికి దారి కనిపించలేదు. ముసలిదాని జాడ కూడా తెలియలేదు. ఇక ఆ ఉలి తనకు ప్రాప్తంలేదనుకుని, లీలను కూడా తన గుర్రం మీద ఎక్కించుకుని, గోవర్ధనుడు నగరానికే తిరిగిపోయి అక్కడ సుఖంగా జీవించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, లీల తిరిగి బతికినాక తన తల్లిదండ్రులను చూడనని ఎందుకు పట్టుపట్టింది? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "లీల చాలా పట్టుదల గలది అని తెలుస్తూనే ఉన్నది. అందుకే ఆమె తండ్రిని వ్యతిరేకించి చిన్నతనం నుంచీ కూడా గోవర్ధనుడి జీవితాన్ని పంచుకుంటూ వచ్చింది. అతన్ని పెళ్ళాడాలన్న పట్టుదలతోనే తాను ఆత్మహత్య చేసుకున్నట్టు నటించి, తన తల్లిదండ్రులకు గర్భశోకం కలిగించటానికి నిశ్చయించుకున్నది. ఇప్పుడు గోవర్ధనుడు తమ కన్న సంపన్నుడు గనక ఆమె తల్లిదండ్రులు ఆమె పెళ్ళికి సంతోషంగా ఒప్పుకుంటారు. కాని వారి ఆమోదం లీలకు అవసరంలేదు. వారి గర్భశోకాన్ని పోగొట్టి సంతోషపెట్టాలన్న భావం ఆమెకు తిరిగిరాదు. అందుచేతనే ఆమె తన ఇంటికి వెళ్ళ నిరాకరించింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# తెలకలవాడి చిలుక

ఒక తెలకలవాడి వద్ద అందమైన చిలుక ఉండేది. అది వాడి నూనెదుకాణంలో కట్టిన పంజరంలో ఉండేది.

ఒకనాడు దుకాణంలోకి గండుపిల్లి వచ్చింది. దాన్ని చూసి చిలుక భయపడి, అరిచి, అర్భాటం చేసి, పంజరంలో ఎగిరెగిరి పడింది. దాని అర్భాటానికి పంజరం కొక్కెం నుండి ఊడి కింద పడింది. ఒక పెద్ద నూనె జాడీ పగిలిపోయి, నూనె అంతా నేలపాలయింది.

నూనెవాడికి చిలుక మీద కోపం వచ్చి, దాని తల మీది వెంట్రుకలన్నీ పీకి, బోడి తల చేశాడు. చిలుక యజమాని మీద అలిగి మాట్లాడటం మానేసింది. తాను చేసిన పనికి తెలకలవాడు కూడా పశ్చాత్తాపపడ్డాడు.

రెండు వారాలు గడిచినాక, ఒక బట్టతలవాడు నూనె కొనటానికి వచ్చాడు. అంత దాకా బెల్లం కొట్టిన రాయిలా ఉన్న చిలుక గట్టిగా నవ్వసాగింది.

"ఎందుకు అంత సంతోషం?" అని యజమాని అడిగాడు.

"ఈ మనిషి యజమాని కూడా తెలకలవాడే లాగుంది! నెత్తిన ఒక్క వెంట్రుక లేదు!" అన్నది చిలుక.

—ఎం. వరేంద్రకుమార్





# ఆత్మీయత

ఒక గ్రామంలో రామయ్యా, సోమయ్యా అనే ఇద్దరు ప్రాణస్నేహితు లుండేవారు. రామయ్య వ్యాపార జీవితం గడిపి క్రమేణా గొప్ప ధనికుడయాడు. కాని సోమయ్య హెచ్చుగా దేశసంచారం చేసి విజ్ఞానవంతు డుగా తయారయాడు. అతని సంపాదన రామయ్య సంపాదనలో పదో వంతు లేక పోయినా, అతని భుక్తికి సరిపోయేదిగా ఉన్నది. సంపదలో తేడా ఉన్నప్పటికీ ఇద్దరి మధ్యా గల స్నేహభావానికి ఎలాటి భంగమూ కలగలేదు. సోమయ్య పాండి త్యాన్ని చూసి రామయ్య ఎంతో ముచ్చట పడేవాడు. రామయ్య వ్యాపారదక్షత చూసి సోమయ్య ఎంతో సంతోషించేవాడు. ఇలా ఇద్దరూ తమలో లేనిదాన్ని రెండోవాడిలో చూసుకుని ఆనందించేవాళ్ళు.

కాలక్రమాన రామయ్యకు ఒక కొడుకు కలిగాడు. మరి కొంత కాలానికి సోమయ్య ఒక కూతుర్ని కన్నాడు. రామయ్య కొడుకు పేరు మాధవుడు. సోమయ్య కూతురి పేరు రాధ.

రాధ పుట్టిన కొద్ది రోజులకు సోమయ్య భార్య చనిపోయింది. అందుచేత రామయ్యా, ఆయన భార్యా ఆ పిల్లను తమ వద్దనే ఉంచుకుని, ఎంతో గారాబంగా పెంచ సాగారు.

మరి కొంత కాలానికి రామయ్యకు ఒక ఆలోచన వచ్చింది. ధనవంతుడి కొడుకు కావటం చేతనూ, తన తండ్రికి చెప్పుకో దగిన జ్ఞానం లేకపోవటం చేతనూ మాధ వుడు బొత్తిగా మూఢుడయేటట్టు కనిపిం చాడు. అతడికి చదువుసంధ్యలు అబ్బే లక్షణం కనిపించలేదు. అందుచేత రామయ్య తన కొడుకును సోమయ్య కిచ్చి, వాణ్ణి పెంచి పెద్దచేయమనీ, వాడికి విజ్ఞానం కలిగించమనీ అన్నాడు.

కోలా అప్పారావ్

ఈ విధంగా రామయ్యా, సోమయ్యా తమ పిల్లలను మార్చుకున్నారు. రాధ సామాన్య కుటుంబీకుడి కూతురే అయినా, సంపన్నుడైన రామయ్య ఇంట ఏ లోటూ లేకుండా పెరిగి పెద్దదయింది.

మాధవుడు స్వతహాగా తెలివి తేటలు కల వాడే. అతను సాధారణ కుటుంబీకుడి ఇంట చేరటం చేత అతని మనస్సు అల్ప సుఖాల కోసం పాకులాడక, సోమయ్య సాంగత్యంలో బాగా పదునెక్కింది. బుద్ధి బాగా తెలిసే నాటికి మాధవుడు తన తండ్రి సోమయ్యే అనుకుని, ఆయన మరింత సుఖంగా బతికేటట్టు చూడటానికి తాను సాధ్యమైనంత విద్యావంతుడు కావాలని దీక్షపట్టాడు. ఆ దీక్షతో అతను సమస్త శాస్త్రాలూ అభ్యసించి, గొప్ప ప్రజ్ఞావంతుడని పేరు తెచ్చుకున్నాడు.

తమ కుమారుడు ప్రయోజకుడు కావటం చూసి రామయ్యా, ఆయన భార్యా ఎంతగానో సంతోషించారు. మాధవుణ్ణి విజ్ఞానిగా చెయ్యటంలో తన ప్రయత్నం సిద్ధించినందుకు రామయ్య తృప్తిపడ్డాడు.

ఈ లోపల రామయ్యా, సోమయ్యా ఆప్త మిత్రులు కావటం చేత రెండు ఇళ్ళ మధ్యా రాకపోకలు జరుగుతూనే ఉండేవి. రాధా మాధవుడూ చిన్నతనం నుంచీ స్నేహంగానే ఉండేవారు. మాధవుడికి రాధ అంటే మొదటినుంచీ ఎంతో ఇష్టం. వయసు వచ్చిన కొద్దీ, అతనికి రాధ మీద ఉండే అభిమానం ప్రేమగా మారింది.



కాని రాధలో అలాటి పరిణామం ఏమీ కలగలేదు. తానొక ధనవంతుడి కూతురు నన్న భావం ఆమెలో బాగా పాతుకు పోయింది. రామయ్య వెంట ఆమె సోమయ్య ఇంటికి వచ్చినప్పు డామెకు ఎప్పుడు తిరిగి ఇంటికి పోతామా అని ఉండేది. సోమయ్య అన్నా, మాధవుడన్నా ఆమెకు ఎంత అభి మానం ఉన్నా, వాళ్ళు పేదవాళ్ళనే భావం ఆమెలో ఉండనే ఉండేది.

పిల్లలిద్దరూ యుక్త వయస్కులు కాగానే రామయ్యా, సోమయ్యా కలిసి మాట్లాడుకుని, వారిద్దరికీ వివాహం చెయ్య టానికీ, జన్మరహస్యం చెప్పెయ్యటానికీ నిర్ణయించుకున్నారు.

సోమయ్య ఇంటికి వచ్చి మాధవుడితో, "నాయనా, నీకూ, రాధకూ పెళ్ళి చేద్దా మనుకుంటున్నాం. నీ ఉద్దేశమేమిటి?" అని అడిగాడు.

"నేను రాధను తప్ప మరెవ్వరినీ పెళ్ళా డనని ఏనాడో నిశ్చయించుకున్నాను," అన్నాడు మాధవుడు.

రామయ్య కూడా రాధతో, "నీకూ, మాధవుడికీ పెళ్ళి చేద్దామనుకుంటున్నాం, తల్లీ? నీకేమీ అభ్యంతరం లేదుగా!" అన్నాడు.

"మాధవుడు మంచివాడూ, ప్రజ్ఞావంతుడే గాని, వాళ్ళు చాలా బీదవాళ్ళు కాదూ?" అన్నది రాధ.

ఈ మాటకు రామయ్య అదిరిపోయాడు. ఆయన వెంటనే రాధతో, "అమ్మా, మాధ వుడు బీదవాడు కాడు, వాడు నా కొడుకూ, నా ఆస్తికి వారసుడూనూ. నువు నిజానికి సోమయ్య కూతురివి. రోజుల పిల్లగా ఉండగా నీ తల్లి పోతే మేం తెచ్చి పెంచాం. మాధవుడు డబ్బు మూలంగా చెడిపోతాడని వాణ్ణి మీ నాన్న దగ్గిర పెట్టాం. వాడు ప్రయోజకుడయాడు కూడానూ. అందుచేత నువు మీ పెళ్ళికి సందేహించనక్కర్లేదు," అని చెప్పాడు.

రాధకు కనువిప్పయి పశ్చాత్తాపం కలి గింది. తరవాత రాధామాధవులకు సలక్ష ణంగా పెళ్ళి జరిగిపోయింది.



# చిక్కిపోయిన "అ"

ఒక వూళ్ళో ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. వాడి పేరు వెంకటి. వాడికి చదువు అంట లేదు. నాలుగు రోజులపాటు వీధిబడికి వెళ్ళి, పలక మీద రాసిన పెద్ద అక్షరాలు, అ అలు దిద్ది, తరవాత చదువు మానేశాడు.

కాలక్రమాన వాడికి పెళ్ళి అయింది. దసరాపండగ వస్తే వాడు అత్తవారింటికి వెళ్ళాడు. వాడు అత్తవారిల్లు చేరేసరికి వాడి మామగారు అవసరమైన పనిమీద గ్రామాంతరం వెళ్ళి ఉండి, తాను ఫలానా రోజుకు తిరిగి వస్తున్నానని ఇంటికి ఉత్తరం రాశాడు.

ఆ ఉత్తరం చదివిపెట్టమని అత్తగారు అల్లుడి కిచ్చింది.

వెంకటి ఆ ఉత్తరం తీసుకుని, చదవటం చాతగాక ఏడవ నారంభించాడు. అందులో ఏదో దుర్వార్త ఉన్నదని ఇంట్లో ఆడవాళ్ళందరూ ఏడవసాగారు. ఇరుగు పొరుగువాళ్ళు చేరారు. ఎవరో ఉత్తరం తీసుకుని చదివి, "ఇందులో చెడ్డ వార్త ఏమీ లేదే! పంతులుగారు ఇవాళో రేపో బయలుదేరి వస్తున్నట్టు రాశారు. అల్లుడుగారు ఎందు కేడిచినట్టూ?" అన్నారు.

"నేను చదువుకున్నప్పుడు 'అ' ఇంత పెద్దదిగా ఉండేది. ఈ ఉత్తరంలో అది చిక్కిపోయింది. అందు కేడ్చాను!" అన్నాడు వెంకటి.

తమ అల్లుడి చదువు గుంటఓనమాల దగ్గిర ఆగిపోయిందని అత్తవారికి తెలిసిపోయింది.

—ఎం. ప్రభాకరరావు





# నుడిగలవాడు

నార్వేదేశంలోని ఒక పట్టణంలో ఒక ధని కుడికి ఇద్దరు కొడుకు లుండేవాళ్ళు. ఆ ధని కుడికి సముద్రం మధ్యలో ఒక దీవి ఉండేది. ఆ దీవి చేపలవేటకు అనుకూ లంగా ఉండేది. వేసవిలో అక్కడ ధనికుడి కొడుకులు చేపలవేట సాగించేవాళ్ళు. వాళ్ళ కోసం అక్కడ ఒక ఇల్లు కూడా ఉండేది.

ధనికుడి కొడుకులలో పెద్దవాడు గంభీర స్వభావం కలవాడు. అతని ఆలోచనలు ఎవరికీ తెలిసేవికావు. అతను ఎవరితోనూ మనసిచ్చి స్నేహం చేసేవాడు కాడు. రెండో వాడు అన్నకు విరుద్ధంగా ఉండేవాడు, సాహసమైన పనులు చేసేవాడు. "నేను నుడిగలవాణ్ణి" అనేవాడు, తన సాహసం వల్ల నష్టం కలిగినా లక్ష్య పెట్టేవాడు కాడు.

ధనికుడు చనిపోయాక మిగతా ఆస్తితో పాటు, సముద్రంలో ఉన్న దీవి కూడా అన్నదమ్ములకు వచ్చింది. వాళ్లు భాగాలు పడలేదు. ప్రతి వేసవికీ పడవలో దీవికి వెళ్ళి, అక్కడ కొన్నాళ్ళు చేపలవేట సాగించి, వానలు జాస్తి అయే సమయానికి తిరిగి వచ్చేవాళ్ళు. వాళ్ళ దీవిని చలి కాలంలో రకరకాల మరుగుజ్జుల జాతుల వాళ్ళు ఉపయోగించుకుంటారని పుకారు ఒకటి ఉండేది. ఈ మరుగుజ్జుల జాతుల వాళ్ళను చూసినవారు లేరు. వాళ్లు మనుషు లతో సాధారణంగా కలవరు. వాళ్ళంటే మామూలు మనుషులకు ఎక్కడలేని భయం కూడానూ.

ఒక ఏడు అన్నదమ్ములిద్దరూ దీవిలో చేపలు పట్టి తిరిగి వచ్చిన కొద్ది రోజులకు, దీవి మీద కొంత సామాను దిగబడిపోతే, దాన్ని తీసుకు రావటానికి పడవలో వెళ్ళారు. వాళ్లు తిరిగి బయలుదేరే వేళకు సూర్యాస్త మానమయింది.

నార్వే జానపద కథ

అన్న తమ్ముడితో, "మనం ఈ పూట తిరిగి పోవద్దు. ఈ రాత్రి తుపాను వచ్చే టట్టుంది. రేపు ఉదయం బయలు దేరుదాం," అన్నాడు.

"తుపాను రాదు, ఏమీ రాదు. మనం బయలుదేరుదాం పద!" అన్నాడు తమ్ముడు.

"నేను చాలా అలసిపోయాను. ఈ పూట ప్రయాణం చెయ్యటం నా వల్ల కాదు," అన్నాడు అన్న.

ఆ రాత్రికి ఆ అన్నదమ్ములు ఆ దీవిలో ఉన్న ఇంట్లోనే గడిపారు. తమ్ముడు తెల్ల వారి లేచేసరికి అన్న లేడు. వాళ్లు వచ్చిన పడవ కూడా లేదు. కాని ఆహార పదార్థాలూ, ఒక తుపాకీ, ఇంకా అనేక ఇతర వస్తువులూ ఉండిపోయాయి.

"అన్న సాయంకాలానికి తిరిగి వస్తా డులే," అనుకుని తమ్ముడు వంట చేసు కుని సుఖంగా భోజనం చేశాడు.

రోజులూ, వారాలూ గడిచిపోతున్నాయి గాని అన్న రాలేదు. తన వంతు ఆస్తి కూడా కాజేసే ఉద్దేశంతో తనను అన్న ఈ నిర్జన మైన లంక మీద వదిలి వెళ్ళాడని తమ్ముడు గ్రహించాడు. అది నిజమే. అన్న అవతలి వొడ్డు చేరుతూ, పడవను బోల్తా కొట్టించి, తన తమ్ముడు సముద్రంలో మునిగిపోయి నట్టు ఊళ్ళో అందరికీ చెప్పాడు.

అయితే తమ్ముడు విచారించి, మతి పోగొట్టుకోలేదు. ఒక తెప్ప తయారు చేసు కుని దాని సహాయంతో చేపలు పట్టాడు; తుపాకితో పిట్టలను కొట్టాడు; అడవి





ముల్లంగి దుంపలు తవ్వాడు; ఎలాగో తన పొట్టపోసుకుంటూ ఆ దీవి మీదనే నివసించసాగాడు.

చలికాలం వచ్చింది. అందరూ అనుకునేది నిజమైతే ఆ దీవి మీదికి మరుగుజ్జులు వచ్చేది ఈ రోజులలోనే. "రానీ! కాస్త సందడిగానన్నా ఉంటుంది," అనుకున్నాడు తమ్ముడు.

నడి శీతాకాలంలో ఒకనాడు చీకటి పడినాక సముద్రం మీది నుంచి అతనికి వాద్య సంగీతం విన వచ్చింది. అతను బయటికి వచ్చి చూసేసరికి సముద్రం మీద వెలుగు కనబడింది. ఆ వెలుగు ఒక పడవ నుంచి వస్తున్నది. అటువంటి పడవను అతనెప్పుడూ చూడలేదు. దాని తెరచాప నలు చదరంగా, పట్టుతో చేసినట్టుగా ఉన్నది. దాని కట్టుతాళ్ళు ఉక్కుతీగ లంత సన్నగా ఉన్నాయి. పడవ నిండా మరుగుజ్జులు నీలంరంగు బట్టలు ధరించి ఉన్నారు. చుక్కాని వద్ద పెళ్ళికూతురి వేషంలో ఒక అమ్మాయి నిలబడి ఉన్నది. ఆమె చూడటానికి ఏ మహారాణో అన్నట్టున్నది. ఆమె మరుగుజ్జు కాదు, మామూలు మనిషే. అంత అందమైన ఆడదాన్ని ఎన్నడూ చూడలేదనుకున్నాడు తమ్ముడు.

పడవ తానున్న చోటి కేసి వస్తూండటం గమనించి, అతను చప్పున ఇంట్లోకి పరిగెత్తి, గోడన వేళ్లాడుతున్న తుపాకీ తీసుకుని, అటక మీది కెక్కి పడుకున్నాడు. కింద జరిగేది అతనికి కనిపిస్తున్నది.

త్వరలోనే మరుగుజ్జు లందరూ ఇంట్లో ప్రవేశించారు. వాళ్ళు ఎంతమంది ఉన్నారో లెక్కలేదు. ఇల్లు వాళ్ళతో కిటకిటలాడిపోయింది. మరుగుజ్జులు ఇంటిని రాజభవనం లాగా చేశారు. ఎక్కడ చూసినా వెండి, బంగారు పాత్రసామానే.

మరుగుజ్జు లందరూ ముందు భోజనాలు చేసి, తరవాత కోలాహలంగా నృత్యం చెయ్యసాగారు. ఒక్క పెళ్ళికూతురు తప్ప మిగిలిన వాళ్ళందరూ నృత్యం చేస్తున్నారు. మరుగుజ్జు పెళ్ళికొడుకు ఆమెను నృత్యం

చెయ్యమని ఆహ్వానించాడు గాని, ఆమె చిరాకుపడి వాణ్ణి ఒక్క తోపుతోసింది.

తమ్ముడు అటక మీది నుంచి గాలికిటికీ కుండా బయటికి దిగి, మరుగుజ్జుల పడవను బంధించి, ఇంటి ముందు ద్వారానికి వచ్చి, లోపల జరిగేది చూస్తూ నిలబడ్డాడు. కొంచెం సేపు అలా చూసి, ఇక ఈ ఉత్సవాన్ని ముగించాలనుకుని, తుపాకీ ఎత్తి ఇంటిలోకి పేల్చాడు. తుపాకీ మోత వినగానే మరుగుజ్జులందరూ పాలోమని బయటికి వచ్చేశారు. వాళ్ళు తమ పడవ దృఢంగా బంధించి ఉండటం చూసి కొండలలోకి పారిపోయారు.

ఇంట్లో పెళ్ళికూతురూ, తమ్ముడూ, మరుగుజ్జుల వెండి, బంగారు పాత్రసామగ్రి మిగిలాయి. పెళ్ళికూతురు అతనికి తన కథ అంతా చెప్పింది. ఆమె చాలా చిన్న పిల్ల అయి ఉండగా మరుగుజ్జులు ఆమెను ఎత్తుకుపోయి సాకారు. ఆమెకు జీవితం సుఖంగానే గడిచింది గాని, మరుగుజ్జులామెకు నచ్చలేదు. ఒక మరుగుజ్జువాడు తనను పెళ్ళాడమని ఆమెను తెగపీడించసాగాడు. అప్పటి నుంచీ ఆమెకు వాళ్ళ మీద మరీ అసహ్యం పుట్టింది.

పెళ్ళికూతురి ఊరి పేరూ, తల్లి పేరూ వినగానే వాళ్ళు తనకు దూరపు బంధువులని తమ్ముడికి తెలిసిపోయింది. "నేను నిజంగా సుడిగల వాణ్ణే. సందేహం లేదు," అనుకున్నాడతను.

తరవాత వాళ్ళిద్దరూ మరుగుజ్జుల పడవలోనే సముద్రం దాటి తమ పట్టణం చేరి,



అక్కడ పెళ్ళి చేసుకుని, కాపరం ప్రారంభించారు.

ఇప్పుడు తన తమ్ముడు తన కన్న ధనికుడు కావటం చేత అన్న అతని సంపద మరుగుజ్జుల నుంచే వచ్చిందని ఊహించాడు. నడి శీతాకాలంలో తమ దీవి మీదికి మరుగుజ్జులు వస్తారన్న పుకార్లు అతనికి తెలిసినవే.

మరుసటి ఏడు శీతాకాలం అన్న దీవి మీదికి వెళ్ళాడు. అతను దీవిని సమీపిస్తూండగా అతనికి సముద్రం మీద కాంతులూ, భయంకరమైన కేకలూ వినిపించాయి. ఈకలు కాలిన కమురువాసన కొట్టింది. అతను భయపడి తమ ఇంటిలోకి పరిగెత్తాడు.

ఈసారి సముద్రం మీద వచ్చినవాళ్ళు మరొక జాతి మరుగుజ్జులు. వాళ్ళు లావుగా ఉండి, పైనుంచి కిందికి తోళ్ళు ధరించి ఉన్నారు. వాళ్ళు పడవలో రాలేదు, సముద్రాన్ని ఈది వచ్చారు. వాళ్లు తమ ఇంట్లోకి రాబోతున్నారని గ్రహించి అన్న తాను కూడా అటక మీదికి ఎక్కాడు.

ఒక మరుగుజ్జు పొయిలోకి తుమ్మేసరికి నిప్పు రాజుకున్నది. ఆ నిప్పులో మరుగుజ్జులు సముద్రపు పాచీ, తడి చెక్కలూ వేసి ఇల్లంతా ఊదర పెట్టారు. అన్న కూడా గాలికిటికీలో నుంచి బయటికిపోవ యత్నించాడు గాని, కాస్త స్థూలశరీరం కావటంచేత మధ్యలో ఇరుక్కుపోయి, భయంతో కేకలు పెట్టాడు. మరుగుజ్జులు అంత కన్న గట్టిగా కేకలు పెడుతూండటం చేత అన్న కేకలు ఎవరికీ వినిపించలేదు.

తొలికోడి కూసే వేళకు మరుగుజ్జులు వెళ్ళిపోయారు. అన్న కూడా గాలికిటికీ నుంచి ఇవతల పడగలిగాడు. అతను ఎలాగో ఇంటికి చేరాడు, కాని అతని మతి చెడిపోయింది. ఉన్నట్టుండి గట్టిగా అరిచేవాడు. చనిపోవడానికి ముందు అతని ఉన్మాదం పోయింది. అతను దీవిలో తన అనుభవాలు బయటపెట్టి ప్రాణాలు వదిలాడు.

అటు తరవాత ఆ దీవి మీదికి మనుష్యమాత్రు డెవడూ పోలేదు. ఒక ఉప్పెనలో అది సముద్రంలో కరిగిపోయింది.





# అలీబాబా నలభైదొంగలు

చాలాకాలం క్రితం పర్షియాలోని ఒకానొక నగరంలో కాసిం, అలీబాబా అని ఇద్ద రన్నదమ్ములు ఉండేవాళ్ళు. వారి తండ్రి పేదవాడు. ఆయన తన కొడుకులకు ఇచ్చిపోయిన ఆస్తి ఏమీలేని కారణం చేత, వాళ్ళు త్వరలోనే పస్తులుండవలసిన స్థితి ఏర్పడింది. పెద్దవాడైన కాసిం జిత్తులమారివాడు కావటం చేత, ఒక యుక్తిపరురాలైన ముసలిదాన్ని ఆశ్రయించి, ఆమె సహాయంతో ఒక డబ్బుగల యువతిని పెళ్ళాడాడు. ఆ విధంగా అతను పస్తుల నుంచి బయటపడటమే కాక, ఊళ్ళో ఒక మంచి దుకాణానికి సొంతదారు కూడా అయాడు. అతని కష్టాలు అలా తీరిపోయాయి.

చిన్న వాడైన అలీబాబాకు పెద్ద ఆశలేమీ లేకపోవటం చేత, కట్టెలు కొట్టే వృత్తి అవలంబించి, తన సంపాదనను ఎంతో పొదుపుగా వాడుకుంటూ, అందులో నుంచే మొదట ఒక గాడిదనూ, తరవాత రెండో గాడిదనూ, మరికొంత కాలానికి మూడోగాడిదనూ కూడా కొనగలిగాడు. అతను ఈ మూడు గాడిదలనూ అడవికి తోలుకుపోయి, అక్కడ తాను కొట్టిన కట్టెలన్నిటినీ వాటి మీద వేసి తెస్తూ ఉండేవాడు. మూడో గాడిదను కూడా కొన్నాక, అలీబాబాకు నగరంలోని కట్టెల వాళ్ళలో గొప్ప ప్రాముఖ్యం వచ్చింది. అందు చేత ఒక కట్టెలు కొట్టేవాడు తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చేశాడు. ఆమె పేదది కావటం చేత సారె ఏమీ తీసుకురాలేదు. అయితే పేదతనం గాని, ఐశ్వర్యంగాని శాశ్వతంకావు.

అలీబాబాకూ, అతని భార్యకూ గుమ్మడి పళ్ళలాంటి బిడ్డలు కలిగారు. వారి కుటుంబమంతా కట్టెల అమ్మకం మీదనే బతుకుతూ వచ్చింది.

అరేబియా జానపద కథ



ఒకనాడు అలీబాబా అరణ్యంలో దట్టమైన చెట్లమధ్య కట్టెలు కొట్టుకుంటున్నాడు. అతని గాడిదలు కొద్ది దూరంలోనే గడ్డి మేస్తున్నాయి. ఆ ముహూర్తంలో అదృష్ట దేవత అతన్ని కటాక్షించింది! దూరంగా గుర్రాలు దౌడు తీస్తున్నధ్వని అస్పష్టంగా అతనికి విన వచ్చింది. అలీబాబా శాంత స్వభావుడూ, పిరికివాడూ కావటం చేత ఎత్తయిన చెట్టు ఎక్కి చుట్టూ కలయజూశాడు. అక్కడి నుంచి అతనికి అరణ్యమంతా కనిపిస్తున్నది.

అతను చెట్టెక్కటం మేలయింది. ఎందుచేతనంటే కొద్ది సేపటికే సాయుధులైన అశ్వికులు ఆ చెట్టున్న దిక్కుగా వచ్చారు. వారి ముఖాలు నల్లగా ఉన్నాయి; కళ్ళు ఎర్రగా ఉన్నాయి; గడ్డాలు మధ్యగా చీలి, భయంకరమైన కాకిరెక్కల్లాగా ఉన్నాయి. వాళ్ళు ప్రమాదకరమైన బందిపోటు దొంగలని అతను గ్రహించాడు.

వాళ్ళు దాదాపు చెట్టుదాకా వచ్చి, తమ నాయకుడు సంజ్ఞ చేయగానే గుర్రాలు దిగారు; గుర్రాలను కట్టేసి, వాటి ముందు బార్లీధాన్యపు సంచులు విప్పి పోశారు. తరవాత వాళ్ళు తమ జీనుసంచులను తీసుకుని సోల్పుగా నడుస్తూ రాసాగారు. అప్పుడు అలీబాబా వారిని లెక్క పెట్టాడు. వాళ్ళు నలభైమంది ఉన్నారు.

అలీబాబా ఎక్కిన చెట్టు ఒక గుట్ట మీద ఉన్నది. దొంగలు ఆ గుట్ట దిగువకు తమ సంచులను మోస్తూ వచ్చి ఒక పెద్ద రాయి వద్ద నిలిచారు. దొంగలనాయకుడు రాయికేసి తిరిగి, "తెరుచుకో, సమ్‌సమ్!" అన్నాడు. వెంటనే ఆ రాయి తెరుచుకున్నది. మిగిలిన దొంగలందరినీ మూటలతోసహా లోపలికి పోనిచ్చి, దొంగలనాయకుడు తాను కూడా తన మూటతో లోపల ప్రవేశించి, "మూసుకో, సమ్‌సమ్!" అన్నాడు. రాయి వెంటనే మూసుకున్నది.

ఇదంతా చెట్టు మీది నుంచి నిర్ఘాంతపోయి చూస్తున్న అలీబాబా, "ఈ మాయ మెధవలు నన్ను ఈ చెట్టు మీద కనిపెట్ట

కుండా అల్లా కాపాడాలి!" అనుకున్నాడు. అతను చెట్టు మీద కదలకుండా కూర్చుని, చప్పుళ్ళుచేస్తూ పొదలమధ్య మేస్తున్న తన గాడిదల కేసి ఆదుర్దాగా చూశాడు.

చాలాసేపు గడిచాక దూరంగా ఉరిమి నట్టుగా ధ్వని వినపడింది. రాయి తెరుచు కున్నది. నలభైమంది దొంగలూ ఖాళీ సంచులతో బయటికి వచ్చారు. అందరూ గుర్రాలెక్కిన తరవాత దొంగలనాయకుడు, "మూసుకో, సమ్‌సమ్!" అన్నాడు. రాయి మళ్ళీ మూసుకున్నది. తమ నాయకుడి వెనకగా దొంగలందరూ వెళ్ళిపోయారు.

వాళ్ళు మళ్ళీ తిరిగి రావచ్చునన్న భయంతో, అలీబాబా, వాళ్ళు కనుచూపు మేర దాటిపోయిన చాలాసేపటి దాకా చెట్టు మీదనే ఉండి, చాలా నింపాదిగా చెట్టు దిగి వచ్చాడు. నేల మీదికి వచ్చాక కూడా అతను ఊపిరి బిగబట్టి, మునివేళ్ళ మీద నడుస్తూ రాతిని సమీపించాడు. అతను ఈ క్షణం దాకా తన మూడు గాడిదల క్షేమం తప్పించి మరి దేన్ని గురించీ దిగులు పడిన వాడు కాడు, ఎందుకంటే తన కుటుంబాని కంతకూ అవే జీవనాధారం.

కాని ఇప్పుడు అతని మనస్తత్వంలో పెద్ద మార్పు వచ్చింది. అతనిలో అదృష్టదేవత కొత్త ఆసక్తిని రేకెత్తించింది. అతను రాయిని పరీక్షించి చూస్తే అందులో ఎక్కడా సూది దూరేపాటి పగులయినా కనిపించలేదు. అయినా అందులో నలభైమంది దొంగలు దూరటం తాను కళ్ళారా చూశాడు. కనక



అందులో ఏదో మాయమంత్రం ఉండాలి. రాయిని తెరవటానికీ, మూయటానికి ఉపయోగించే మంత్రం తాను విని ఉన్నాడు. దాన్నే తాను కూడా ఉపయోగిస్తే ఏం?

అలీబాబా తన సహజమైన భయాన్ని కూడా మరిచిపోయి, రాయి కేసి తిరిగి, "తెరుచుకో, సమ్‌సమ్!" అన్నాడు. అతను బెదురుతూ, చిన్న గొంతుతోనే ఆ మాటలన్నప్పటికీ రాయి తెరుచుకున్నది. ఇది జరిగినప్పుడతను వెనక్కు తిరిగి పారిపోయి ఉండవలిసింది కాని విధి అతన్ని లోపలికి తొంగి చూడమని ప్రేరేపించింది.

లోపల అతనికి కనిపించినది చీకటి గుహ కాదు, విశాలమైన చావడి. అది కొండ రాతిలో చక్కగా మలచి ఉన్నది. కింద నేల గచ్చులాగున్నది. మధ్య నడవ ఉన్నది. పైకప్పులో చేసిన కంతలకుండా లోపలికి వెలుగు వస్తున్నది. అలీబాబా అల్లాను స్మరిస్తూ నడవలోకి అడుగు పెట్టాడు. నడవ దాటి చావడిలోకిపోతే గోడల వెంబడి, కప్పు దాకా అమూల్యమైన వస్తువులు పేర్చి ఉన్నాయి—పట్టు తానులూ, సరిగ తానులూ, రకరకాల ఆహారపదార్థాల సంచులూ, పెట్టెల నిండా వెండి, బంగారు ఇటుకలూ, బంగారు దీనారాలూ ఉన్నాయి. ఇవి చాలనట్టు నేల మీద బంగారమూ, మణులూ రాసులు పోసి ఉండి, కాలు మోపే చోటు లేకుండా ఉన్నది.

అలీబాబా తన జీవితంలో ఒక బంగారు దీనారం ముఖం ఎలా ఉంటుందో ఎరగడు.



అయినా ఈ సంపద కొన్నివందల ఏళ్ళ మీదట పోగు చేసినదై ఉండాలనీ, ఎన్నో తరాల బందిపోటు దొంగలు ఇందుకు కృషి చేసి ఉండాలనీ గ్రహించాడు. అతను తనలో, "ఒరే, అలీబాబా! గాడిదలే ఆస్తిగా, కట్టెలే జీవనాధారంగా గల నీకు ఎలాటి సిరి పట్టిందిరా! ఎన్నో పాపాల ఫలితమైన ఈ సంపదను ఈశ్వరుడు నీ ఎదట పెట్టాడు!" అనుకున్నాడు.

ఇలా అనుకుని అతను ఒక అహార పదార్థాల సంచీ అక్కడే ఖాళీ చేసి, దాని నిండా బంగారు నాణాలు నింపాడు. ఇలా తన గాడిదలు మోయగలుగుతాయన్న మేరకు సంచులు నింపి, తన గాడిదలను రాయి వద్దకు తెచ్చి, వాటి మీద బంగారం నింపిన సంచులు ఎక్కించి, వాటిపైన కంప కప్పి, రాయిని మంత్రంతో మూసి, ఇంటిదారి పట్టి, గాడిదలను అదలించకుండా, అవి నడవ గలిగినట్టుగా నడవనిస్తూ నగరంలో తన ఇంటిని చేరుకున్నాడు.

అతను ఇంటికి చేరేసరికి తల వాకిలి మూసి, లోపల గడియపెట్టి ఉన్నది. తన మంత్రం ఇక్కడ పారుతుందో లేదో చూదామని అలీబాబా, "తెరుచుకో, సమ్‌సమ్!" అన్నాడు.. వెంటనే గడియ దానంతట అదే తీసుకుని, తలుపు తెరుచుకున్నది. అందు చేత అతను తాను వచ్చిన సంగతి ఎవరికీ



తెలియకుండానే తన అవరణలోకి గాడిదలను తోలి, "మూసుకో, సమ్‌సమ్!" అనేసరికి తలుపు మూసుకుని, గడియ పడిపోయింది.

అతను గాడిదల మీది నుంచి సంచులు దింపుతూండగా అతని భార్య ఇంట్లో నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి, "నేను లోపల గడియపెట్టానే, తలుపు ఎట్లా తెరిచావు?" అని అడిగింది.

అలీబాబా ఆమె అడిగిన దానికి జవాబు చెప్పక, "అల్లా మనకీ సంచులు ప్రసాదించాడే! వాటిని లోపలికి చేర్చటానికి సాయపడక, తలుపులూ, గడియలూ అంటావేమిటి?" అన్నాడు.



ఆమె సంచులు ఎత్తి చూసి వాటినిండా డబ్బున్నదని గ్రహించింది. అందులో ఉన్నది రాగి నాణాలే అయి ఉంటాయనే అనుకున్నప్పటికీ ఆమెకు భయం పట్టుకున్నది; తన భర్త ఏ దొంగల ముఠాతోనో, మరోరకం దుర్మార్గులతోనో చేరి పోయాడనుకున్నది. సంచులన్నీ లోపలికి చేరాక ఆమె ఇక పట్టలేక తన చెంపలు వాయించుకుని, బట్టలు చించుకుంటూ, "మన ప్రారబ్ధం! మన ఖర్మ! అయ్యో పిల్లలు! అయ్యో, ఉరికంబం!" అని ఏడవసాగింది.

అలీబాబా కోపంతో, "ఉరికంబమూ లేదు, నీ తలకాయా లేదు, పాపిష్టిదానా! దేనికి నీ శోకాలు?" అన్నాడు.

"ఈ సంచులతో ఇంటికి పాపం చుట్టుకుంటుందిరా, మొగుడా! వీటిని మళ్ళీ గాడిదలకెత్తి, దూరంగా పారేసిరా, నీకు పుణ్యం ఉంటుంది!" అంటూ ఆమె ఏడ్చింది.

"ఛీ ఈ ఆడముండలకు బుద్ధి అన్నది లేదు. నేనీ సంచులు దొంగిలించా ననుకున్నావుటే? ఈ ఉదయం అరణ్యంలో అల్లా నన్ను అనుగ్రహించాడు. ముందు సంచులు ఖాళీచేసి, తరవాత నీకు అంతా చెబుతాను. ఇప్పటికి నోరు మూసుకో," అన్నాడు అలీబాబా.

అతను చాప పరిచి, దాని మీద సంచులన్నీ ఖాళీచేసి, ధగధగా మెరిసే బంగారం కుప్పగాపోసి, తన భార్యకు అడవిలో జరిగినదంతా చెప్పాడు.

కథ అంతా విన్నాక అతని భార్యకు భయంపోయి, పట్టరాని ఆనందం కలిగింది. ఆమె అల్లాను రకరకాలుగా కొనియాడింది. ఆమె కుప్ప ముందు గొంతుకూర్చుని ఒక్కొక్క దీనారమే లెక్కపెట్ట సాగింది.

అలీబాబా నవ్వి, "ఏం చేస్తున్నావే, వెర్రిదానా? అలా ఎంత సేపని లెక్కపెట్ట గలవు? వంటింటో గుంట తవ్వి వీటిని పూడ్చిపెడదాం పట్టు. ఇరుగు పొరుగు వాళ్ళకు తెలిస్తే ఈర్ష్యపడతారు. రాజభటులకు తెలిస్తే ప్రమాదం," అన్నాడు.

అతని భార్యకు ప్రతిదీ సక్రమంగా జరగాలి. అందు చేత ఆమె ఆ బంగారాన్ని తూచటమో, కొలపటమో చెయ్యాలన్నది. లేకపోతే తాము ఎంత ధనికులయిందీ ఎలా తెలుస్తుంది?

"కొంచెం ఓపిక పట్టు. నేను పక్క వాళ్ళింటి నుంచి కొలపాత్ర తెస్తాను. మన దగ్గిర ఎంత ఉన్నదీ తెలుస్తుంది. నువు గుంట తవ్వటం పూర్తి చేసేలోపున నేను కొలపటం పూర్తి చేసేస్తాను. తరవాత బంగారం పూడ్చిపెడదాం," అన్న దామె.

ఇది అలీబాబాకు అనవసరమనిపించింది. అయినా, అదృష్టం కలిసి వచ్చిన ఇలాటి రోజున భార్య ముచ్చట కాదనలేక అతను, "అయితే, త్వరగావెళ్ళిరా. మన రహస్యం నోరు జారనిచ్చేవుసుమా!" అన్నాడు.

అలీబాబా భార్య దగ్గిరలోనే ఉన్న తన బావగారు కాసిం ఇంటికి వెళ్ళి, కాసిం భార్యతో, "మీ కొయ్య కొలపాత్ర ఇస్తారా? ఇప్పుడే మళ్ళీ తెచ్చి ఇస్తాను," అన్నది.

ఈ కాసిం భార్య మానమర్యాదలు లేని మనిషి. ఆమె తన మరిదిని గాని, తోడికోడలును గాని ఒక్కసారి కూడా వెళ్ళి చూసిన పాపానపోలేదు; అలీబాబా పిల్లలకు ఇంత తాయిల్లం పెట్టిఎరగదు. "కొలపాత్ర" అన్నమాట వినగానే ఈ మహా ఇల్లాలికి ఆశ్చర్యం ముంచుకొచ్చింది. ఎందు కంటే,



అలీబాబా ఇంట ఒకరోజుకు సరిపడే ధాన్యం మించి ఉండదు. మహా ఉంటే వారానికి సరిపడే ధాన్యం ఉండేను. ఇంత పేద వాళ్ళకు కొలపాత్ర ఎందుకు కావలిసి వచ్చిందో తెలుసుకోవాలనిపించి ఆమె, "పెద్ద కొలపాత్ర ఇవ్వనా, చిన్నది ఇవ్వనా?" అని అడిగింది.

"చిన్నదే ఇవ్వు, తల్లీ," అన్నది అలీ బాబా భార్య.

కాసిం భార్య లోపలికి వెళ్ళి, చిన్న కొలపాత్ర అడుగున కొంచెం కొవ్వురాచి తెచ్చి అలీబాబా భార్య కిచ్చింది.

అలీబాబా భార్య ఆ కొలపాత్రతో ఇంటికి తిరిగివచ్చి, పాత్రలో దీనారాలు నింపి పక్కన

పోస్తూ, లెక్క కోసం గోడమీద బొగ్గుతో గీతలు గీయసాగింది. ఆమె ఈ పని పూర్తి చేస్తూండగా అలీబాబా వంటింట్లో గొయ్యి తవ్వేసి ఇవతలికి వచ్చాడు. అతని భార్య గర్వంగా గోడమీద బొగ్గు గీతలు అతనికి చూపి, అతను బంగాం పూడ్చిపెట్టేలోగా కొలపాత్ర తిరిగి ఇవ్వటానికి వేగంగా వెళ్ళింది. పాత్ర అడుగున ఒక దీనారం అంటుకున్న సంగతి, పాపం, ఆమెకు తెలియదు.

"పని కాగానే నీ పాత్ర తెచ్చి ఇచ్చావమ్మా. మళ్ళీ ఇంకోసారి అడిగితే నీకు ఇవ్వ బుద్ధి పుట్టాలి గదా!" అన్నదామె కాసిం భార్యతో.

అలీబాబా భార్య వెళ్ళిందో లేదో, కాసిం భార్య కొలపాత్రను తల కిందులు చేసి చూసింది. అందులో ఆమె అనుకున్నట్టుగా ధాన్యం ఏమీ లేదు గాని, పాత్ర అడుగున అంటుకుని ఒక బంగారు దీనారం కనబడింది. ఆమె ముఖం కందగడ్డలాగా అయింది; కళ్ళు నల్లకప్పు వేశాయి. పట్టరాని ఈర్ష్యతో, "వీళ్ల ఇల్లు వల్లకాదు గానూ! ఈ దరిద్రపు మొహాలకు కొలిచేటంత బంగారం వచ్చిందా?" అనుకున్నది.

తన భర్త దుకాణం నుంచి తిరిగి వచ్చిన దాకా కూడా ఆమె వేచి ఉండలేక, అతని కోసం పనిమనిషిని పంపింది; అతను రోజుతూ, రొప్పుతూ గుమ్మంలోకి రాగానే, అతనేదో మహా ద్రోహం చేసినట్టు, నానా మాటలూ అనసాగింది; అతను గుక్క తిప్పుకునే అవకాశం ఇవ్వకుండానే, బంగారు దీనారం అతని ముఖంమీద పెట్టి, "చూశావా, చూశావా? ఇది నీ తమ్ముడు వాళ్ళ చెత్త కుప్పలో పారేసినది! నీకు బుద్ధి లేదు. నీకేమో పెద్ద దుకాణం ఉందనీ, నీ తమ్ముడికి ఉన్నవి మూడు గాడిదలు మాత్రమేననీ నువు బొర్ర నిమురుకుంటూ మురిసి పోతున్నావు. కట్టెలుకొట్టుకుని కడుపుమాడ్చుకునే నీ తమ్ముడి దగ్గిర ఎంత బంగారం ఉన్నదంటే, అతగాడికి దాన్ని ఎంచటానికి వ్యవధి లేక కొలుస్తున్నాడు! ధాన్యం అమ్మేవాడు కొలిచినట్టు కొలుస్తున్నాడు!" అన్నది.

—(ఇంకా వుంది)





# పిల్లిదానం

ఒక ఊళ్ళో ఒక ధనికుడు ఒక ఇల్లు కట్టించాడు. ఆ వూళ్ళోనే గొప్ప జ్యోతిషపండితుడుగా పేరు మోసిన పరమానందం అనే ఆయన గృహప్రవేశానికి ముహూర్తం కూడా పెట్టాడు.

గృహప్రవేశానికి ముందుగానే ధనికుడు జ్యోతిషపండితుడికి కొత్తగా కట్టిన ఇల్లు చూపించటానికి తీసుకు వచ్చాడు. ఆ సమయంలో ఒక పిల్లి, తన పిల్లలను వెంటబెట్టుకుని వచ్చి, ఇవతలి అరుగు మీది నుంచి అవతలి అరుగు మీదికీ, తిరిగి ఇవతలి అరుగు మీదికీ దూకటం వాళ్ళ కంట పడింది. ఇది చూడగానే పరమానందానికి ఒక ఆలోచన తట్టింది. ఇల్లు కట్టినవాడు బాగా డబ్బున్నవాడే గాక, అనేక మూఢ విశ్వాసాలు గలవాడు. అందుచేత బాగా లాభం పొందటానికి ఒక మార్గం ఆలోచించాడు పరమానందం.

అతను గృహయజమానితో, "ఈ పిల్లి శకునం చిత్తగించారా, బాబూ? ప్రస్తుతానికి గృహప్రవేశం వాయిదా వెయ్యండి. దీనికి కొంత శాంతి, యాగమూ, తతంగమూ ఉన్నాయి," అన్నాడు.

"శాంతా? పరిహారమా?" అన్నాడు గృహయజమాని కంగారు పడుతూ.

"తమకు అంతా అరిటిపండు వొలిచినట్టు చెబుతాను," అని పరమానందం ఒక సంస్కృత గ్రంథాన్ని తెచ్చి, అక్కడక్కడా చదివి, "చూశారూ, మార్జాల లంఘనమూ, దాని వెంట ఉన్న రెండు కూనలున్నూ ఏమి సూచిస్తున్నవనగా, ఈ ఇంటిలో రెండు పిశాచములు దూకుతూ ఆడుకొంటున్నవి. వాటి ఉచ్చాటనకు గాను వజ్రకుంత మనే యాగం చేసి, పిల్లి ప్రమాణంలో ఒక బంగారు పిల్లిని చేయించి, ఒక మంత్రవేత్తకు దానం ఇవ్వవలెను," అన్నాడు.

టి. కరుణకుమార్



"అలాగే చేద్దాం. ఆ యాగమూ అదీ మీ చేతి మీదుగానే చేయించండి. దానం కూడా మీరే పుచ్చుకుందురు గాని," అన్నాడు గృహయజమాని. పరమానందాన్ని మించిన మంత్రవేత్త మరిలేడని ఆయన నమ్మకం.

గృహప్రవేశానికి కొంచెం వ్యవధిగా ముహూర్తం పెట్టి, ఆ ముహూర్తంలోనే యాగం కూడా ఏర్పాటు చేశారు. దానికి మంత్రవేత్తలు కొందరు వచ్చారు. వారిలో కృష్ణభట్టు అనేవాడు మంత్రశాస్త్రం పఠ చదివినవాడు. ఆయన మార్జాలశకునం గురించి గాని, వజ్రకుంతయాగం గురించి గాని ఎక్కడా చదవలేదు, ఎన్నడూ విన లేదు. ఈ పరమానందం గృహయజమానిని మోసం చేస్తున్నాడని గ్రహించి కృష్ణభట్టు పరమానందంతో రహస్యంగా, "ఈ యాగ మేమిటి? ఈ బంగారు పిల్లి దానమేమిటి? దీని సంగతి ఏమిటో తేలుద్దామని ఉన్నది," అన్నాడు.

"ఇప్పుడు గొడవ చేయకు. ఈ తతంగం పూర్తి అయిన తరవాత మనమూ మనమూ మాట్లాడుకుని ఏదో ఒక ఏర్పాటు చేసుకుందాం," అన్నాడు పరమానందం.

కర్మకాండ ముగిసింది. పరమానందం బంగారు పిల్లిని దానంపట్టాడు. ఇళ్ళకు వెళ్లే టప్పుడు కృష్ణభట్టు పరమానందంతో, "నా శంక మీరు తీర్చనేలేదు," అన్నాడు.

"శంకకేమున్నది? ఆ పుణ్యాత్ము డిచ్చాడు, నేను దానం పుచ్చుకున్నాను. ఇది మా ఇద్దరికీ సంబంధించిన విషయం," అన్నాడు పరమానందం.

"కాని ఇందులో వంచన ఉన్నది. ఆ సంగతి దానం ఇచ్చిన పెద్ద మనిషికే గాక, రాజుగారికి కూడా తెలియవలసినది," అన్నాడు కృష్ణభట్టు కోపంగా.

"చీకటి పడ్డాక ఝాము రాత్రి వేళ మీగ మా యింటికి వచ్చినట్లయితే బంగారు పిల్లలో మీకు వాటా ఇస్తాను. సరా?" అన్నాడు పరమానందం.

"నాకు ఒక్కడికే ఇవ్వటం కాదు. ఇవాళ వచ్చిన సదస్యులలో మంత్రవేత్తలం పది

మంది దాకా ఉన్నాం. అందరికీ వంతు రావలిసిందే!" అన్నాడు కృష్ణభట్టు.

"దానికేం? అలాగే చేద్దాం. మీరు ఝాము రాత్రికి మా యింటికి రండి," అన్నాడు పరమానందం. కృష్ణభట్టు తన బసకు వెళ్ళిపోయాడు.

వెంటనే పరమానందం గృహయజమాని ఇంటికి వెళ్లి, "తమరితో చెప్ప మరిచాను. ఇంటి పిశాచాలను ఉచ్చాటన అయితే చేశాం గాని, వాటి సేవకుడు ఏ ఝాము రాత్రి వేళనో మీ వద్దకు వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టవచ్చు. ఆ పిశాచం, ఇవాళ మన యాగానికి వచ్చిన బ్రాహ్మలలో ఎవడి రూపాన వచ్చినా రావచ్చు. అందుచేత మీరు ఈ కర్రను తీసుకుని ఆ పిశాచాన్ని చూడగానే నెత్తి మీద బాదండి" అంటూ తన చేతికర్ర గృహయజమానికి ఇచ్చాడు.

ఆ రాత్రి ఝాము పొద్దుపోయాక కృష్ణ భట్టు పరమానందం ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. పరమానందం తలుపు తెరిచి, "నువా? ఏం పని?" అని కటువుగా అడిగాడు.

"ఆ బంగారు పిల్లి గురించి మాట్లాడ టానికి వచ్చాను," అన్నాడు కృష్ణభట్టు.

"నీతో మాట్లాడవలసిన దేమీ నాకు లేదు. ఆ దానం నాది. నేను ఎవరికీ అందులో వాటా ఇవ్వను," అన్నాడు పరమానందం.



"అయితే సంగతి అంతా ఆ పెద్ద మనిషికి చెప్పనా?" అన్నాడు కృష్ణభట్టు.

"ఇప్పుడే వెళ్ళి చెప్పుకో! నాకు భయం లేదు," అంటూ పరమానందం తలుపు దఢాల్న మూసేశాడు.

కృష్ణభట్టు తిన్నగా గృహయజమాని ఇంటికి వెళ్ళాడు. ఆయన తలుపు తట్ట బోతూండగా లోపల మాటలు వినిపించాయి. కృష్ణభట్టు ఆగి ఆ మాటలు విన్నాడు.

"ఏమండీ, ఆ కర్ర పట్టుకుని అలా తలుపు దగ్గిర తారట్లాడు తున్నారేమిటి?" అని ఇంటాయన భార్య అడుగుతున్నది.

"మరేమీ లేదే! పిశాచాల నౌకరు ఎవరో బ్రాహ్మడివేషంలో వస్తాడని మన పరమా

నందంగారు హెచ్చరించి, వచ్చిన వాణ్ణి తలపగల గొట్టమని మంత్రించిన ఈ కర్ర ఇచ్చి వెళ్ళారు. ఆ పిశాల నౌకరు కోసం ఎదురు చూస్తున్నా!" అన్నాడు ఇంటి యజమాని.

పరమానందం వేసిన ఎత్తు కృష్ణభట్టుకు అర్థమయింది. అదృష్టవశాన తనకు గండం వెంట్రుక వాసిలో తప్పింది. ఇంత దుర్మార్గానికి ఒడిగట్టిన పరమానందాన్ని శిక్షించాలి. ఆ ఉద్దేశంతో కృష్ణభట్టు తన బసకు తిరిగిపోయి, ఒక పని మనిషికి కాస్త డబ్బిచ్చి, ఏదో చెప్పి పంపాడు.

ఆ పనిమనిషి వచ్చి గబగబా పరమానందం ఇంటి తలుపు తట్టి, తలుపు తీసిన పరమానందంతో, "అయ్యగారూ, ఇవాళ గృహప్రవేశం చేసిన బాబుగారు ఎందుకో స్పృహలేకుండా పడిపోయారండీ! అమ్మగారు తమర్ని వెంటనే రమ్మంటున్నారు," అని చెప్పాడు.

పరమానందం ఆశ్చర్యపడుతూ కొత్త ఇంటికి బయలుదేరాడు. ఆయన తలుపు తట్టగానే ఇంటి యజమాని తలుపు తెరిచి పరమానందాన్ని చూస్తూనే, "పిశాచి వెధవా? ఆ పుణ్యాత్ముడి రూపంలోనే వస్తావా? చావు!" అంటూ కర్రతో పరమానందం నెత్తిన బలంగా కొట్టాడు.

పరమానందం ఆ దెబ్బకు స్పృహతప్పి పడిపోయాడు. ఇంటి యజమాని చప్పున తలుపు వేసుకున్నాడు.

చీకటిలో సమీపంలోనే పొంచి ఉన్న కృష్ణభట్టూ, పనిమనిషీ వచ్చి, పరమానందాన్ని లేవదీసి ఇంటికి నడిపించుకుపోయారు.

"దెబ్బకు ఆశాపిశాచం వదిలిందనుకుంటాను. ఇప్పుడైనా నీ బంగారు పిల్లిని అందరికీ సమంగా పంచుతావా?" అని కృష్ణభట్టు పరమానందాన్ని అడిగాడు.

"బుద్ధివచ్చింది. పంచుతాను. రేపు అందరినీ వెంటబెట్టుకు రండి." అన్నాడు పరమానందం.

మర్నాడు బంగారు పిల్లిని పన్నెండు మందీ పంచుకున్నారు.






ద్వారకలో కృష్ణుడు రాచకార్యా లన్నిటినీ వసుదేవుడికి అప్పగించి, ధర్మరాజు చేయ బోతున్న రాజసూయానికి అవసరమైన వివిధ వస్తువులూ, రత్నాలూ, ధనమూ, ధాన్యాలూ తీసుకుని, రథం మీద బయలుదేరి ఇంద్ర ప్రస్థానికి వచ్చాడు.

ధర్మరాజు కృష్ణుడితో, "రాజసూయం చెయ్యటానికి నీ సహాయం ఎంతైనా అవ సరం. అందుచేత నేనీ యాగాన్ని చెయ్యు టానికి అనుమతి ఇయ్యి, లేదా నువే దీక్ష పూని ఈ యాగాన్ని చెయ్యి," అన్నాడు.

"ధర్మరాజా, సామ్రాజ్యాన్ని భరించ టానికి నువే తగినవాడివి. అందుచేత నువే యాగం చెయ్యి. నువు చెయ్యమన్న పను లన్నీ నేను చేస్తాను," అన్నాడు కృష్ణుడు.

ధర్మరాజు సంతోషించి సహదేవుణ్ణి పిలిచి, యాగానికి అన్నీ సిద్ధం చేయమనీ, నాలుగు వర్ణాలవారినీ ఆహ్వానించమనీ చెప్పాడు; నకులుణ్ణి పిలిచి, హస్తినాపురం నుంచి భీష్మ, ధృతరాష్ట్ర విదురులనూ, ద్రోణ కృపాశ్వత్థామలనూ, దుర్యోధనాదులనూ పిలుచుకు రమ్మన్నాడు. సహదేవుడు అన్ని ఏర్పాట్లూ దివ్యంగా చేశాడు. నకులుడు హస్తినాపురం నుంచి కౌరవ ప్రముఖులను తెచ్చాడు. వారితో ధర్మరాజు తాను తల పెట్టిన పని గురించి చెప్పి, దాన ధర్మాలు చేయటానికి కృపాచార్యుణ్ణీ, భోజనాల ఏర్పాట్లు చూడటానికి దుశ్శాసనుణ్ణీ బ్రాహ్మణులను మర్యాద చెయ్యటానికి అశ్వ త్థామనూ, రాజులను సత్కరించటానికి

23. శిశుపాలవధ



సంజయుణ్ణీ, వచ్చేవారు తెచ్చే కానుకలు భద్రపరచటానికి దుర్యోధనుణ్ణీ, అన్ని పనులూ సక్రమంగా సాగేటట్టు పైన కనిపెట్టి ఉండటానికి భీష్మ ద్రోణులనూ ఏర్పాటు చేసి, తాను యజ్ఞదీక్ష ధరించాడు.

వచ్చిన వారందరూ రాజసూయ యాగం చూడాలనీ, మయసభ చూడాలనీ అభిలాషతో వచ్చారు. రాజులైనవాళ్ళు అంతులేని కానుకలు తెచ్చారు. యాగం జరిగినంతకాలమూ విరామం అన్నది లేకుండా సంతర్పణ సాగింది. యజ్ఞం మహా వైభవంగా పూర్తి అయింది.

అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో, "స్నాతకుడూ, ఋత్విజుడూ, సద్గురుడూ, ఇష్టుడూ, రాజూ, ఇంద్రియాలను సంయమనం చేసినవాడూ—ఈ ఆరుగురూ పూజార్హులని చెబుతారు. అలాటివారిలో గొప్పవాణ్ణిగా చూసి నువ్విప్పుడు పూజించాలి," అన్నాడు.

"అలాటి వాడెవడో మీరే నిర్ణయించి చెప్పినట్టయితే, నేను అతనికి అర్ఘ్యమిస్తాను," అని ధర్మరాజు భీష్ముడితో అన్నాడు.

భీష్ముడు ఆలోచించి, "ఈ సభలో అగ్రపూజకు తగినవాడు కృష్ణుడు తప్ప మరెవరున్నారు? అందువల్ల అతనికే మొదటి అర్ఘ్యం ఇయ్యి," అన్నాడు.

ధర్మరాజు లౌక్యంగా భీష్ముడి ఆజ్ఞను శిరసావహిస్తూ, సహదేవుణ్ణి పిలిచి, మొదటి అర్ఘ్యాన్ని కృష్ణుడికిఇయ్యమనిఆజ్ఞాపించాడు. సహదేవుడు అర్ఘ్యం ఇస్తే కృష్ణుడు సంతోషంగా పుచ్చుకున్నాడు.

ఇందుకు శిశుపాలుడు సమ్మతించక, కృష్ణుణ్ణి ఆక్షేపిస్తూ, ధర్మరాజుతో, "ధర్మరాజా, ఇందరు రాజులూ, మహనీయులూ ఉండగా యాదవుడైన కృష్ణుడికి ఎలా మొదటి అర్ఘ్యం ఇచ్చావు? ఇతను వృద్ధుడా? మీకు ఆచార్యుడా? గొప్ప ఋత్విజుడా? ఇతనిలో ఏమి చూసి ఇచ్చావు? నీకీ సలహా ఇచ్చిన భీష్ముడికి యుక్తాయుక్తాలు తెలియవు. కృష్ణుడికి తొలిపూజ చేయదలచుకున్నప్పుడు ఈ రాజులందరినీ దేనికి ఆహ్వానించావు? ఇది వీరందరికీ అవమానం

కాదా? నువు ప్రతాపవంతుడివని భయ పడి కాదు మేము నీకు కప్పాలిచ్చింది; ధర్మం తెలిసినవాడవనీ, సత్యవ్రతుడవనీ, సామ్రాజ్యం ఏల దగినవాడవనీ ఇచ్చాం. ఈ ఒక్క పాడుపని చేసి నీకున్న కీర్తి నంతా పోగొట్టుకున్నావు," అని, కృష్ణుడితో, "ఈ పాండవులు నీ కుతంత్రాలకు భయ పడిగాని, నీ మీద అమిత ప్రేమతోనో మొదటి అర్ఘ్యాన్ని ఇస్తే, నీకైనా నీ అంతరం తెలియ వద్దా? రాజువు కాని నీకి గౌరవం నిష్ఫలం. దీనివల్ల అవమానం నీకేగాని, సభలోనివారికి కాదు. ధర్మరాజు ధర్మబుద్ధీ, భీష్ముడి తెలివీ, నీ వివేకమూ తెలిసిన తరవాత ఈ సభలో ఉండరాదు," అంటూ, తన పరి వారాన్ని లేపుకుని వెళ్ళిపోబోయాడు.

ధర్మరాజు అతని వెనక పరిగెత్తి, "శిశు పాలా, ఆగు! వెళ్ళిపోకు! నువ్విలా మాట్లా డటం అన్యాయం. భీష్ముడులాటి వృద్ధుణ్ణి అవమానించరాదు. కృష్ణుడి సంగతి నీ కన్న ఆయనకు బాగా తెలుసు. నీ కన్న పెద్ద వాళ్ళు సభలో ఉండి కూడా ఏమీ అభ్యం తరం చెప్పనప్పుడు నువ్వెందుకు ఇలా ఆక్షేపిస్తున్నావు?" అని శాంతవచనాలతో శిశుపాలుణ్ణి సమాధానపరిచేందుకు యత్నించాడు.

అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో, "దుర్మార్గుడైన ఈ శిశుపాలుణ్ణి బతిమాలు తావేం? ఊరుకో!" అని సభవారితో, "ఈ శిశుపాలుడు మూఢుడు కావటంచేత కృష్ణుడి సంగతి ఎరగడు. కృష్ణుడికి మేం





యిచ్చిన మొదటి అర్ఘ్యం ఆమోదించక ఏం చేస్తాడో చేసుకోనిద్దాం," అన్నాడు.

"కృష్ణుణ్ణి మేం పూజించినందుకు ఇంకా అభ్యంతరం ఉన్నవారెవరన్నా ఉంటే వారి నెత్తి మీద నాకాలు పెడతాను," అంటూ సహదేవుడు తన కాలు ఎత్తి నిలబడ్డాడు.

సభలో ఎవరూ సహదేవుడికి జవాబు చెప్పలేదు.

అప్పుడు శిశుపాలుడి సేనాపతి సునీధుడనేవాడు లేచి, "రాజులారా, లేవండి. యాదవులూ, పాండవులూ మనకు చాలా అవమానం చేశారు. సైన్యాలను సిద్ధపరిచి వీరి మదం అణచుదాం," అని, తమ పక్షపు రాజులనందరినీ ఒక పక్కకు చేర్చాడు. యుద్ధసన్నాహానికి శిశుపాలుడు కూడా అనుమతించాడు.

ఇదంతా చూసి ధర్మరాజు భయపడి, భీష్ముడితో, "తాతగారూ, రాజులు యుద్ధానికి దిగుతున్నారు. యాగానికి విఘ్నం రాకుండానూ, ప్రజలకు హాని కలగకుండానూ ఉపాయం చూడాలి," అన్నాడు.

దానికి భీష్ముడు, "కృష్ణుడు నీ యాగాన్ని రక్షిస్తూ ఉండగా దానికి ఎవరు విఘ్నం కలిగించగలరు? శిశుపాలుడికి చేటుకాలం రాబట్టే ఇలాటి దుర్బుద్ధి పుట్టింది," అని చెప్పాడు,

శిశుపాలుడు కోపంతో రెచ్చిపోయి భీష్ముణ్ణి అనరాని మాటలన్నాడు, కృష్ణుణ్ణి నిందించాడు. అతని మాటలు వింటూంటే భీముడికి వీరావేశం వచ్చింది. అతను రౌద్రాకారం దాల్చి, పళ్ళు పటపటా కొరుకుతూ శిశుపాలుణ్ణి చంపటానికి మీదికి పోతుంటే, భీష్ముడు వారించాడు.

తరవాత ఆయన భీముడికి శిశుపాలుడి వృత్తాంతం ఈ విధంగా తెలిపాడు:

శిశుపాలుడు మూడు కళ్ళతోనూ, నాలుగు చేతులతోనూ పుట్టి, గాడిదలాగా ఓండ్ర పెట్టాడు. అది చూసి అతని తల్లిదండ్రులు సాత్వతీ, దమఘోషుడూ అతన్ని పారెయ్యదలిచారు. అప్పుడు అశరీరవాణి, "మీరు వీణ్ణి పారెయ్యకండి. వీడు పరాక్రమవంతు

డవుతాడు. వీడికి ఇప్పుడు చావులేదు. వీణ్ణి చంపేవాడు మరొకచోట పుట్టి పెరుగు తున్నాడు," అన్నది.

అప్పుడు సాత్వతికి పుత్రమోహం పుట్టు కొచ్చి, "వీణ్ణి చంపేవా డెవడో చెప్పు!" అని అశరీరవాణిని అడిగింది.

"ఎవరు వీణ్ణి ఎత్తుకున్నప్పుడు వీడి అదనపు కన్నూ, అదనపు చేతులూ పోతాయో అతని చేతనే వీడికి చావున్నది," అన్నది అశరీరవాణి.

అది మొదలు సాత్వతి తన విడ్డూరపు కొడుకును చూడవచ్చినవారి కందరికీ వాణ్ణి ఎత్తుకోమని ఇస్తూ వచ్చింది. ఇలా ఉండగా ఒకనాడు బలరామకృష్ణులు చేదిపురానికి వచ్చి, దమఘోషుడితో కొంతసేపు మాట్లాడి, అంతఃపురంలో ఉన్న సాత్వతిని చూశారు. ఆమె కుశలప్రశ్నలు చేసి తన కొడుకును ముందు బలరాముడి చేతి కిచ్చింది; తర వాత బలరాముడి దగ్గిర నుంచి పిల్లవాణ్ణి తీసుకుని కృష్ణుడికి ఇచ్చింది. కృష్ణుడు ఎత్తుకోగానే ఆ బిడ్డకున్న మూడో కన్నూ, అదనంగా ఉన్న రెండు చేతులూ పోయాయి.

కృష్ణుడి చేతిలో తన కొడుకు చస్తాడని గ్రహించి దిగులుపడి, సాత్వతి, "వీడు చేసే తప్పులను క్షమించు," అని కృష్ణుణ్ణి బతిమాలింది.



దానికి కృష్ణుడు నూరు తప్పులు క్షమిస్తా నని మాట ఇచ్చాడు.

భీష్ముడు చెప్పిన ఈ విషయాలన్నీ శిశు పాలుడు విని ఆయనను నానా మాటలూ అన్నాడు. తరవాత అతను కృష్ణుడితో, "నాతో యుద్ధానికి రా. నిన్ను నేను చంపే దాకా ఈ భీష్ముడి మదం అణగదు. నిన్ను చంపినాక ఈ పాండవుల సంగతి తేల్చు తాను. నిన్ను పూజించినందున వీళ్ళు కూడా చంపదగినవాళ్ళే," అని నోటి తీటగా మాట్లాడాడు.

అంతా విని కృష్ణుడు అక్కడ చేరిన రాజులతో, "అంతా వినండి. ఈ శిశు పాలుడు మాకు మేనత్త కొడుకై ఉండి



కూడా, అకారణంగా మా యాదవులకు
ఎన్నో అపకారాలు చేశాడు. మేము ప్రాగ్జ్యో
తిషపురం మీదికి దండెత్తిపోయిన సమ
యంలో వీడు మా ద్వారక మీదికి వచ్చి,
మా పురానికి నిప్పుపెట్టి వెళ్ళాడు. మేము
రైవతకపర్వతం మీద విహరిస్తుంటే వీడు
అక్కడికి వచ్చి, మాలో కొందరిని చంపి,
కొందరు స్త్రీలను చెరపట్టాడు. మా తండ్రి
వసుదేవుడు అశ్వమేధం చేసినప్పుడు
అశ్వాన్ని అపహరించాడు. బభ్రువాహనుడి
భార్యను అపహరించాడు. రుక్మిణిని పెళ్ళా
డాలనుకున్నాడుగాని వీడి ఆట సాగలేదు.
ఇలా వాడు చేసిన దారుణాలు ఎన్నో
ఉన్నాయి. మా మేనత్త కిచ్చిన మాట
మూలంగా అన్నిటినీ సహించి ఊరు
కున్నాను," అన్నాడు.

శిశుపాలుడు వెటకారంగా నవ్వి, "కృష్ణా,
నేను వరించినదాన్ని పెళ్ళాడటమే గాక
ఆ సంగతి ఈ సభలో చెప్పుకునేటందుకు
నీకు సిగ్గులేదా? నీ దయవల్ల నేను బతికి
ఉన్నట్టు చెబుతున్నావు. నిన్ను చూస్తే
నాకు భయంలేదు. ఏం చెయ్యగలవో
చెయ్యి," అన్నాడు.

వెంటనే కృష్ణుడు తన సుదర్శనచక్రాన్ని
చేతబట్టి శిశుపాలుడి పైన విసిరాడు, అది
శిశుపాలుడి తల నరికేసింది. శిశుపాలుడు
కూలిపోయాడు. అతనిలో నుంచి తేజస్సు
బయలుదేరి వచ్చి కృష్ణుడిలో ఐక్యం
కావటం చూసి సభలోని వారందరూ
ఆశ్చర్యపోయారు.

ధర్మరాజు శిశుపాలుడి కళేబరానికి అంత్య
క్రియలు జరపటానికి ఉత్తరువిచ్చి, శిశు
పాలుడి కొడుకుకు రాజ్యాభిషేకం చేశాడు.

రాజసూయయాగం పూర్తి అయింది.
ధర్మరాజు అవభృథస్నానం చేసి దీక్ష చాలిం
చాడు. రాజులందరూ ఆయనను సమీ
పించి, సామ్రాజ్యాన్ని సాధించినందుకు
అభినందించి, తిరిగిపోతామని చెప్పారు.
ధర్మరాజు అందరినీ తగిన విధంగా సత్క
రించి, వారిని హస్తినాపురం దాటినదాకా
సాగనంపటానికి తన తమ్ముళ్లను నియోగిం

చాడు. తరవాత కృష్ణుడు కూడా ద్వారకకు తిరిగివెళ్ళాడు. మయసభ చూడాలన్న కోరి కతో దుర్యోధనుడు మటుకు శకునితో సహా ఉండిపోయాడు.

ఒకనాడు ధర్మరాజు సభకు వ్యాసుడు వచ్చాడు. అప్పుడు ధర్మరాజు తనను వేధి స్తున్న అనుమానం ఆయనతో ఇలా చెప్పాడు: "రాజసూయయాగం జరుగు తూండగా శిశుపాలుడి వధ జరిగింది కదా. ఇది ఉత్పాతం కాదా?"

"ఇది ఉత్పాతమే. దీని ఫలితం పద మూడేళ్ళ తరవాత కాని తెలియదు. అప్పుడు క్షత్రియ వినాశం జరుగుతుంది," అన్నాడు వ్యాసుడు. ఈ మాట విని ధర్మరాజు కుంగి పోయాడు. అర్జునుడు ఆయనకు ధైర్యం చెప్పాడు.

మయసభను చూడటానికి ఉండిపోయిన దుర్యోధనుడు పరాభవం పొందాడు. అతను నీరు లేనిచోట నీరున్నదనుకుని బట్టలు ఎగ గట్టుకున్నాడు; నీరున్నచోటు నేల అను కుని అందులోకి నడిచి బట్టలు తడుపు కున్నాడు. ఇది చూసి భీమార్జున నకుల సహదేవులూ, ద్రౌపదీ, సేవకులూ నవ్వారు. అది తెలిసి ధర్మరాజు దుర్యోధనుడి మనసు నొవ్వకుండా ఉండటానికి మంచి బట్టలు కట్టబెట్టాడు.

కాని దుర్యోధనుడి కింకా అవమానాలు జరిగాయి. అతను వాకిలి ఉన్నచోటు గుర్తిం చక, వాకిలి లేనిచోట ఉన్నదనుకుని ప్రవే శించబోయాడు. నుదురు బొప్పి కట్టింది. నేల సమంగా ఉన్నచోట ఎగుడుగా కని పించి ఎక్కబోయి, కిందపడ్డాడు. చూసి ఆనందిస్తూవచ్చిన మయసభ అతని మన సుకు కంటకంగా తయారయింది. అతను అసూయతో దహించుకుపోసాగాడు.

ధర్మరాజుకు సామ్రాజ్యం లభించింది. అతను లోకోత్తరమైన మయసభ సంపా దించాడు. ఈ సంగతులు తలుచుకున్న కొద్దీ దుర్యోధనుడి మనస్తాపం హెచ్చిపోయి అతన్ని దహించివేయసాగింది. అతను ధర్మ రాజుతో వెళ్ళి వస్తానని చెప్పి, హస్తినా పురానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.





# ముగ్గురు యక్షిణులు

## 3

వాళ్ళు భోజనం చేస్తూండగా యక్షరాజు తన కుమార్తెలకు దూత ద్వారా ఒక సందేశం పంపాడు. భోజనాలు పూర్తికాగానే ఆ దూత పెద్ద యక్షిణికి ఒక ఉత్తరం ఇచ్చాడు. ఆమె దాన్ని చదివి కంట నీరు కార్చ సాగింది. రెండవ యక్షిణీ, మూడవ యక్షిణీ కూడా ఆ ఉత్తరం చదువుకుని కన్నీరు కార్చనారంభించారు.

అది చూసి మంగళుడు యక్షిణులతో, "ఆ ఉత్తరం చదివి మీరెందుకు అంతగా దుఃఖిస్తున్నారు? అందులో ఏమున్నది?" అని అడిగాడు.

"మా అన్నను వృషభాసురుడు ఎత్తుకు పోయాడు. అతన్ని విడిపించటం సాధ్యం కాలేదుట," అన్నది పెద్ద యక్షిణి.

"దేవుడు మేలు చేస్తే నేనే విడిపించ గలను. కాని కారాగృహంలో ఉన్న నా నలభై మంది అన్నల మాటేమిటి? వారిని ఎవరు కాపాడుతారు? ఇలాటి పాత్రలు ఇంకా పదకొండు సంపాదించి, వెంట తీసుకుపోతే గాని వారికి విముక్తి కలగదు," అన్నాడు మంగళుడు.

"ఈ ముష్టి పాత్రల కోసం బెంగపడతావేమిటి? ఇలాటివి ఎన్ని కావాలంటే అన్ని ఇస్తాం. ఇక ఆ గొడవ తేకు, సరా!" అన్నారు యక్షిణులు.

"అలా అయితే నా ప్రాణాలు కూడా కాపాడినవాళ్లవుతారు. నన్ను మీ తండ్రిగారి దగ్గిరికి తీసుకుపొండి," అన్నాడు మంగళుడు.

అందరూ కలిసి యక్షరాజు వద్దకు వెళ్ళారు.

మంగళుడు రాజుకు వందనం చేసి, చేతులు కట్టుకుని నిలబడ్డాడు.



"ఈ మానవమాత్రుణ్ణి ఇక్కడి కెందుకు తెచ్చారు?" అని యక్షరాజు తన కుమార్తెల నడిగాడు.

"ఇతను అన్నను వృషభాసురుడి నుంచి రక్షిస్తాడు," అన్నారు యక్షిణిలు.

"నిజమా? నువు నా కొడుకును ఆ రాక్షసుడి నుంచి కాపాడగలవా?" అన్నాడు యక్షరాజు.

"ప్రయత్నిస్తాను," అన్నాడు మంగళుడు.

"ఈ వృషభాసురుణ్ణి నువు చూశావా?" అని రాజు అడిగాడు.

"లేదు," అన్నాడు మంగళుడు.

యక్షరాజు మంగళుడికి తన వద్ద ఉన్న గుర్రాలలో అతనికి కావలసినది ఏరుకో మన్నాడు; తన సొంత ఖడ్గమూ, డాలూ, విల్లూ, గదా ఇచ్చాడు; తరవాత ఆయన తన సేనానాయకుడితో, "ఈ కుర్రవాణ్ణి వృషభాసురు డుండే కొండ దగ్గిర దిగబెట్టిరా!" అన్నాడు.

మంగళుడు తాను ఎన్నుకున్న గుర్రం మీదికి ఎగిరి దూకాడు. అది చూసి యక్షరాజు, "కుర్రవెధవ నెగ్గేటట్టే ఉన్నాడు!" అనుకున్నాడు.

యక్షసేనాపతి మంగళుడి వెంట వృషభపర్వతం దాకా వెళ్ళి, "ఈ కొండ మీదనే వృషభాసురు డుండేది. నువ్వు కొండ మీదికిపో. నేనిక ముందుకు రాను, తిరిగిపోతాను," అన్నాడు.

మంగళుడు అతనికి వీడ్కోలు చెప్పి, గుర్రాన్ని కొండ మీదికి దౌడు తీయించాడు. గుర్రం రాక్షసుడి కోటద్వారం ముందు ఆగింది.

"ఒరే, నాతో యుద్ధానికి రా!" అంటూ మంగళుడు పెద్దగా కేక పెట్టాడు.

ఇద్దరు ద్వారపాలకులు ద్వారం తెరుచుకుని బయటికి వచ్చి, మంగళుడి కేసి ఈసడింపుగా చూసి, అతన్ని లోపలికి వెళ్ళకుండా అటకాయించారు.

మంగళుడు కత్తి దూసి ఇద్దరి తలలూ నరికేసి, వాటిని కిటికీల కుండా లోపలికి విసిరివేశాడు.

ఆ చప్పుడుకు వృషభానురుడు నిద్ర లేచి, కిటికీకుండా మంగళుణ్ణి చూశాడు. వెంటనే అతను తన ఆయుధాలు తీసుకుని బయటికి పరిగెత్తి వచ్చాడు.

ఇద్దరూ ద్వంద్వయుద్ధం ఆరంభించారు. రాక్షసుడు తన గదను మంగళుడి పైకి విసిరాడు.

అది గురి తప్పి కింద పడి, భూమి దద్దరిల్లేటట్టు చేసింది. మంగళుడు దాన్ని తీసుకుని రాక్షసుడి మీదికి వేస్తూ, "యుద్ధం చెయ్యక ఆటలాడతా వేమిటి?" అన్నాడు.

వృషభానురుడు మంగళుడి మీదికి వరసగా ఏడు గదలను విసిరాడు, ఏడు బాణాలు గురిచూసి వదిలాడు. ఏ ఒక్కటీ మంగళుడికి తగలలేదు.

"ఆగు! ఇక నా వంతు!" అంటూ మంగళుడు తన కత్తితో రాక్షసుడి కంఠాన్ని నరికాడు. రాక్షసుడి తల కింద పడి, కొండ కిందికి దొర్లుకుంటూ పోయింది.

మంగళుడు తన గుర్రాన్ని బయట కట్టేసి, కోట లోపలికి వెళ్ళి, యక్షరాజు కుమారుణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి, "పద, మీ నాన్నగారి దగ్గిరికి పోదాం," అన్నాడు.

ఇద్దరూ గుర్రాలెక్కి యక్షరాజుండే చోటికి బయలుదేరారు. దారిలో యక్ష యువరాజు మంగళుడితో, "మా నాన్న నిన్ను ఏదన్నా కోరుకోమంటే, మా అఖరు చెల్లెలిని భార్యగా కోరుకో; అయన చేతిన ఉన్న ఉంగరం కూడా అడుగు. మరిచేవు సుమా!" అన్నాడు.



క్షేమంగా తిరిగి వచ్చిన తన కుమారుణ్ణి చూసి యక్షరాజ దంపతులు పరమానంద భరితులయారు.

రాజు మంగళుడితో, "నీ కేం బహుమానం కావాలో కోరుకో, తప్పక ఇస్తాను," అన్నాడు.

"మహారాజా, నా కోరిక తీర్చదలిస్తే మీ మూడో కూతురిని నాకు భార్యగా ఇవ్వండి; మీ వేలిన ఉన్న ఉంగరం ఇవ్వండి; ఇలాటి పాత్రలు పదకొండు ఇప్పించండి," అన్నాడు మంగళుడు.

"తప్పక ఇప్పిస్తాను. నువు వాటిని పుచ్చుకో దగినవాడివే!" అన్నాడు యక్షరాజు నవ్వుతూ.

మంగళుడికీ, మూడో యక్షిణికీ పెళ్ళి జరిగింది. వివాహమహోత్సవాలు ఏడు రోజులపాటు సాగాయి. ఎనిమిదో రోజున మంగళుడు పన్నెండు పాత్రలూ కట్టుకుని తన భార్యతో సహా బయలుదేరాడు.

అతను తన రాజధాని చేరేనాటికి సంవత్సరం పూర్తి అయిపోయింది. నలభైమంది దొంగలకూ శిరశ్ఛేదం చేసే ప్రయత్నం సాగుతున్నది.

"ఆగండి!" అంటూ మంగళుడు వచ్చి, మూట విప్పి, "ఇవిగో, మీరు కోరిన పాత్రలు!" అని పన్నెండు పాత్రలనూ ఒక దాని పైన ఒకటి పేర్చి రాజు ముందు పెట్టాడు.

రాజు వర్తకుణ్ణి పిలిపించి, "ఈ పాత్రలలో నీ పాత్ర ఏదో పోల్చగలవా?" అని అడిగాడు.

వర్తకుడికి ఆ పాత్ర లన్నిటినీ చూసి తల తిరిగిపోయింది. అతను ఏమీ చెప్పలేక పోయాడు.

రాజు నలభైమంది దొంగలనూ విడిచి పుచ్చి, మోసకారి అయిన వర్తకుడి తల తీయించేశాడు. తరవాత నగరంలో ఉన్న వర్తకు లందరిని రాజు విచారించి, వారిలో మోసగాళ్ళను అందరినీ దేశం నుంచి వెళ్ళగొట్టాడు.

తరవాత రాజు మంగళుణ్ణి యువరాజుగా అభిషేకిస్తే, ప్రజలందరూ హర్షించారు.

—(అయిపోయింది)



ప్రపంచపు వింతలు:

# 110. "శాంతిదాత"

అండీస్ (దక్షిణ అమెరికా) పర్వతాలలో అర్జెంటీనా, చిలీదేశాల మధ్య సరిహద్దులో ఈ యేసుక్రీస్తు విగ్రహం, ఉభయదేశప్రజల మధ్య శాంతికి చిహ్నంగా నిలిచి ఉన్నది. చాలా ఎత్తయిన ఈ కాంస్య విగ్రహం దిగువన ఈ విధంగా రాసి ఉన్నది: "ఈ పర్వతాలు ధూళి అయిపోయినప్పటికీ, అర్జెంటీనా, చిలీదేశాల ప్రజలు ముక్తిప్రదాత అయిన యేసుక్రీస్తు పాదాల చెంత ప్రమాణం చేసి, నిలబెట్టుకుంటామన్న శాంతికి భంగం కలగనివ్వరు."



Photo by R. Udaya Bhaskar Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

పాంచజన్యము కాదు

పంపినవారు:
బి. భీమాచార్, హత్తిబెళగల్లు

Photo by P. B. Khata



బహుమతి
పొందిన వ్యాఖ్య

పంచాక్షరాలు రావు

పంపినవారు:
బి. భీమాచార్, హత్తిబెళగల్లు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 మార్చి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి అయిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పాంచజన్యము కాదు

రెండవ ఫోటో : పంచాక్షరాలు రావు

పంపినవారు : బి. భీమాచార్,

హత్తిబెళగల్లు (కర్నూలు జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

ఎలప్రాయంలోనే
పాపలకు
నేర్పండి



# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకొన్నట్లైన ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్ని అరికట్టుతుంది.




ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా సంరక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టింపబడినది. ఇందులో ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన యాస్ట్రింజెంట్స్ ఉన్నవి. నియమానుసారం రాత్రి, ప్రొద్దుట ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకొనుటవల్ల ఇగుళ్ల బాధలూ దంతక్షయమూ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం అలవాటు చేయటానికి వెంటనే ప్రారంభించండి. క్రొత్త విషయాలని నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పాలి. కనుక వెంటనే ప్రారంభించండి.

ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ గురించి ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.

**ఫోర్‌హాన్స్**

దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్ పేస్టు

**ఉచితము** "దంతములు, ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పదిభాషలలో మానర్స్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టుబాక్సు నం. 10031, బొంబాయి-1 (BR) వారి వద్ద దొరకును.

పేరు ____________________ వయస్సు ________

చిరునామా ____________________



దయచేసి పోస్టు ఖర్చులకై 15 పైసల తపాలా బిళ్లలను పంపండి. మీకు కావలసిన భాషను మార్చి దాని క్రింద గీతగీయండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, తమిళ, తెలుగు, మలయాళం, లేక కన్నడ భాష.

'C. 1'

82F-172 TEL



# టీవియస్ రిట్రెడులు భద్రత నిస్తాయి

టీవియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకంగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్లు చూస్తాము అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టీవియస్‌కు ఇచ్చే ప్రతీ టైరూ కూడా ట్రెడ్‌ను వదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది. అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషీనుల మీద మంచి నైపుణ్యతగల సాంకేతిక శిల్పంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని

టీవియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు ఆశ్చర్యములేదు టీవియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు వెచ్చించే ప్రతీ రూపాయికి అధికంగా టైరు మైళ్ళనిస్తాయి.

మీరు టీవియస్‌ను విశ్వసింపవచ్చు— భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.







మీరు టీవియస్‌ను విశ్వసింపగలరు

## సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్

బెంగళూరు-కోయంబత్తూరు-కలమసేరి-మద్రాసు-మధురై-సేలం-సికింద్రాబాద్-తిరునెల్వేలి-విజయవాడ.

SI 6073

